# మీ తీర్పు ఏమిటి

తనంతట తానే
బలిపీఠం మీద
అడుగు పెట్టింది !
అహంతో అపార్థాలతో
పచ్చని కాపురాన్ని
స[illegible]నం చేసుకుంది !
ఈమె చేసిన నేరానికి మీరిచ్చే
తీర్పు ఏమిటి ?



## సాంఘిక చిత్ర యుగంలో సంచలనాత్మక చిత్రం !

నేటి మేటి నటీనటుల
ప్రతిభకు గీటురాయి.



ఇతను చేసిన
నేరం ఏమిటి ?
ఎందుకింత
శిక్ష ?
న్యాయం మీరు
చెప్పండి !
తీర్పు మీరే
ఇవ్వండి !

నేనింతవరకు కొన్ని తరహా పాత్రలనే పోషించాను కాని —

బలిపీఠం చిత్రంలో అరుణపాత్ర ఇంతవరకూ నేను వెయ్యని ఒక వెరైటీపాత్ర !

సినిమాచూసి బయటకు వెళ్ళేముందు అరుణపాత్ర మీద సానుభూతితో రెండు కన్నీటిబొట్లు రాల్చగలిగితే ఆపాత్రకు నేనున్యాయం చేసినట్టులెక్క !

నా కృతజ్ఞతలు.

సర్వదా మీ అభిమానం కోరే

శారద

పత్రికలు.... ప్రజలు
ముక్తకంఠంతో
'ఉత్తమ చిత్రం'
అని ప్రశంసిస్తున్న.....

ముప్పలనేని శేషగిరిరావు సమర్పించు

రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్

# బలిపీఠం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత వై. సునీల్ చౌదరి

స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం దాసరి నారాయణరావు

సోల్ డిస్ట్రిబ్యూటర్స్, అనిల్ ప్రభాస్ ఎంటర్ ప్రైజెస్

శ్రీ ఫిలింస్

VEEKAY

# రాజేష్ ఖన్నా

బహుమాన యోగ్యమైన మరొక భూమికలో

U-BDM-26 TEL

నాలుగు సార్లు బహుమతి గెలుచుకున్న రాజేష్ ఖన్నా, మరొక్కసారి ఫ్యాషన్ ప్రపంచంలో, కొత్త భూమికలో, ప్రజల మన్ననలను అందుకున్నారు. బొంబే డయింగ్ వారి షర్టింగు, సూటింగులలో. ప్రతిరోజూ ఒక కొత్తదీ, తాజాదీ అయిన డిజైనుతో, వ్యామోహితులను చేసే శ్రేణిలో. సింథటిక్ షర్టింగు 50/50, 67/33, 80/20, అదిగాక 100% పోలియస్టర్ ప్రింట్లు, పోలియస్టర్ డెనిమ్స్, ఇంకా [illegible] సూటింగులు.

**బట్టల్లో లెక్కకు మిక్కిలి అందాలు—**
**ప్రతి రోజూ సరికొత్త డిజైన్లతు రూపాలు**

**కాపితాన్** పోలియస్టర్ షర్టింగు
**వాడ్రీన్** పోలియస్టర్ సూటింగు

# బొంబే డయింగ్



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1975 'దీపావళి'కి ప్రత్యేకం!

## "చిన్న సీరియల్ కథ"ల పోటీ!

## మొత్తం రు. 5000ల బహుమతులు

ఏటా నిర్వహిస్తున్న కథల పోటీ బదులు యీ ఏడు, రచయితల, పాఠకుల అభిరుచిని దృష్టిలో పెట్టుకుని "చిన్న సీరియల్ కథల" పోటీని నిర్వహిస్తున్నాము. సంపాదకుని ఎన్నికలో అత్యుత్తమంగా తేలిన **నాలుగు** సీరియల్ కథలను, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒకదాని తర్వాత ఒకటి వంతున వరుసగా వెలువరించి, వాటిపై పాఠకుల బ్యాలట్ తీసుకొని యెప్పటివలె అదనపు బహుమతులను కూడా విజేతలైన రచయితలకు అందించుతాము.

### *ముగింపు తేదీ మంగళవారం* 16–9–1975

*పోటీలో నెగ్గిన నాలుగు రచనలలో ఒక్కొక్క "చిన్నసీరియల్ కథ"కి రు. 800లు చొప్పున పారితోషికం అందజేస్తాము.*

ఇదిగాక పాఠకుల 'బ్యాలట్'లో ప్రథమస్థానాన్ని పొందిన రచనకి రు. 600లు, ద్వితీయ స్థానం, తృతీయ స్థానం పొందిన రచనలకు రు. 500లు, రు 400లు చివరి కథకు రు. 300లు చొప్పున అదనపు బహుమతులు యిస్తాము.

నిబంధనలను గమనించి యీ పోటీలో లోగడకన్నా ఎక్కువమంది రచయితలు పాల్గొని ఈ కొత్త తరహా పోటీని జయప్రదం చేయగలరని అనుకుంటున్నాము.

★ చిన్న సీరియల్ కథ అంటే ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు వారాలు వేయటానికి సరిపోయే 'పెద్ద కథ' అనుకోవచ్చును.

★ కథ నిడివి **50** అరఠావులకి (పేజీకి 600 అక్షరాలు మించకుండా) దాటకూడదు. ఇతివృత్తం తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై వుండాలి. తేట తెలుగు వ్యావహారిక భాషలోనే వ్రాయటం అవసరం.

★ **కథ** అనువాదం, అనుసరణ కారాదు. ప్రసారమైనా ప్రచురణ అయినా, లేదా యితర **పత్రికలకు** పంపబడి పరిశీలనలో వున్న, కథలను పంపరాదు. ఇతరులు వ్రాసిన కథలను వారిపేరులోనే అయినామరొకరు పంపకూడదు. హామీ పత్రం కథతోపాటు విధిగా వుండాలి. దానిమీద రచన పేరు రచయిత చిరునామా కూడా విడి విడి అక్షరాలలో వుండాలి.

★ రచనలపై వచ్చే పేచీలకు రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ "1975 దీపావళి చిన్న సీరియల్ కథల పోటీ: సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520003 అన్న చిరునామాకి రచనలను పంపాలి. పోటీలో పాల్గొన్న రచయితలు తమ 'కథ'తో పాటు స్వంత చిరునామా గల' తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన పెద్ద కవరును జతపరచాలి. పోటీలో ఎన్నిక కాని రచనలను వీలువెంబడి వారికి త్రిప్పి పంపడం జరుగుతుంది.

★ రచనలన్నీ మా కార్యాలయానికి 16-9-75 మంగళవారం సాయంకాలానికి అందాలి. **అటు తరువాత అందిన రచనలను పోటీకి పరిశీలించలేము. టపా ఆలశ్యం కావటం, మార్గంలో పోవటం లాంటి యిబ్బందులకు సంపాదకుని బాధ్యత లేదు.**

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి. అలా యిష్టం లేనివారు కథల పోటీకి తమ రచనలు పంపకపోవటమే మంచిది.

★ ఎన్నికైన నాలుగు కథలలో మొదటిదాని ప్రచురణ 1975 దీపావళి సంచికలో ప్రారంభం కావచ్చు. నాలుగు కథల ప్రచురణ పూర్తి కాగానే అనగా 16 వారాల తర్వాత 'బ్యాలట్' పత్రం ద్వారా పాఠకుల తీర్పును తీసుకుంటాము. — సం.

# ఉత్తరాలు

### ఉత్తరాలు

"ఉత్తరాలు" శీర్షికకు ఒక పూర్తి పేజీ అయినా కేటాయించవలసినదిగా కోరుచున్నాను. ప్రతివారం కనీసం మూడు కథలయినా వేసేలాగున చూడవలసినదిగా కోరుచున్నాను.

పుల్లగూర సుబ్రహ్మణ్యం. (కదిరి.)

### కథలు

'ఎదురింటి అమ్మాయి' ఒక్క రోజులో ఇల్లు మార్చేసిందంటే ఆ వూళ్లో అద్దె ఇళ్లు దొరుకుతున్నాయన్నమాట. బాబ్బాబూ ఆ వూరు పేరు చెప్పండి మేం అక్కడికి బదిలీ చేయించు కుంటాం.

బి. శ్రీదేవి (కాకినాడ)

"నీతి—ధర్మం" కథ చిన్నదైనా నీతి పెద్దది. రచయిత పి. ఎం. సూర్యనారాయణ గారికి ఇంత మంచికథ నందించి నందుకు మా ధన్యవాదాలు. డాక్టర్ సలహాలు చాలా విజ్ఞాన దాయకంగా ఉంటున్నాయి. ఫాలాక్షుని డైరి చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంటున్నది. మొత్తానికి (మా మీ) పత్రిక ప్రతివారం ఎదురుచూసేట్లు చేస్తున్నది.

వై. విజయమోహన్‌రెడ్డి (నెల్లూరు)

### స్వీట్స్

శ్రీనివాస్‌గారి సినీ వార్తల స్వీట్స్— రామలక్ష్మి అక్కయ్య జవాబులు హాట్స్‌గా ఉంటున్నాయి.

టి. దాలయ్య, సూరాడ నారాయణరావు, ఎస్. ఇ. రైల్వే హిమ్‌గిర్ (ఒరిస్సా)

### ముఖచిత్రం

ఈ వారం [11—4—75] 'ఆంధ్రపత్రిక' ముఖ చిత్రం (సంగీతం) హుందాగా ఉంది. కృష్ణకుమారిగారి "అందరిలో గుడి ఉంది" లోని 'సరోజ' వంటి డాక్టర్లు చాలా అరుదుగా కనిపిస్తారు.

గుండాల వెంకటేశ్వరరావు (భువనేశ్వర్) ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 15-8-'75
రాక్షసనామ సం. శ్రావణమాస శు. నవమి
**సంపుటము : *68* సంచిక : *48***
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
శత్రుఘ్న సిన్హా
(ఫొటో : ఉత్తర)

**కథలు :**

| | | |
|---|---|---|
| చిలకలు | ... | 7 |
| రజతోత్సవం | ... | 30 |
| ఏకాంతం | ... | 34 |

**సీరియల్ కథలు :**

| | | |
|---|---|---|
| రాగ వీచికలు | ... | 12 |
| గాజుమేడ | ... | 19 |

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు—4, లోకం పోకడ—5, డాక్టర్ సలహాలు-6, రాశిఫలాలు-8, హైదరాబాద్ నోట్‌బుక్—16, ఫలాక్నుమా డైరీ—17, ధర్మపథం—18, యువతరం — 21 సినిమా — 24, హిందీలో వెలువడిన కొన్ని తెలుగు రచనలు, అవీ — ఇవీ — అన్నీ — 31, వారఫలం—44 ప్రశ్నావళి—46.

## లోకం పోకడ — ఊమెన్












## డాక్టర్ సలహాలు

**టి యు. వరంగల్.**

నాకు కనీసం 10 సం. నుండి చెవిలో చీము కారుతోంది. ఏదైనా మందు తెల్పండి.

మన సాంప్రదాయాలలోని కొన్ని అవలక్షణాలలో చెవులలో 'నూనె' వేయుటం ఒకటి. చెవులోని ఏదన్నా మెషిన్లా తరచూ నూనెవేయుటానికి. చెవుల నిర్మాణం తెలిసిన వారికి చెవి 1/2 అంగుళం తర్వాత ఒక పొర (కర్ణబేరి) చె అడ్డగింపబడుతుందని దాని తర్వాత లోపలి చెవికీ బయట కనపడే కాలువకూ సంబంధం లేదనీ తెలిసే ఉంటుంది.

మామూలుగా పొడిగా ఉన్న ప్రదేశంలో దుమ్ము అంటుకుపోదు. అదే ప్రదేశం నూనెమయం అయితే దుమ్ము గట్టిగా అతుక్కుపోతుంది. చెవులలో నూనె వేస్తే జరిగేది ఇదే. దీనితోబాటు పుల్లలతో కెలకటం వల్ల లోపల చర్మంలో సన్నని గీతలు ఏర్పడి దుమ్ము లోని క్రిములు చెవులలో చీము కలుగచేస్తాయి.

చీముని పరీక్షించి, క్రిములను కనుగొని తగిన యాంటిబయాటిక్స్ వాడితే తప్పక నయమవుతుంది.



**ఎ. వి. పోలూరు.**

నా వయస్సు 68 సం. లు. కంఠముపై కుడి వైపున కొంచము ఉబ్బుగా వున్నది. 3మాసముల పైనే వున్నది. వాపు హెచ్చుతగ్గులవుతూ వుంటుంది. డాక్టరు సలహాపై మాత్రలు వాడినను గుణము కన్పించలేదు.

కంఠం కుడివైపున వాస్తే ఒక వేళ ఆ వాపు థైరాయిడ్ గ్రంధికి సంబంధించినదా లేదా అని నిర్ధారణ చేయుటం అవసరం. థైరాయిడ్ గ్రంధి వాపైతే గుటకలు వేస్తే ఈ వాపు పైకి, క్రిందికి జరుగుతుంది.

రోగనిర్ణయం చెయ్యనిదే మందునువాడినా ఫలితం ఉండదు.

**సి. ఆర్. ఆర్. నరసరావుపేట.**

నాకు 23 సం. లు కుడి కంట్లో కొద్దిగా మెల్ల వున్నది. దీనిని తొలగించవచ్చా? ఎక్కడ వీలవుతుంది.?

కంటిలో 'మెల్ల' (స్క్వింట్) ఉంటే నేత్ర వైద్యులు పరీక్షించి, వీలయితే కళ్లజోడు వ్రాసివ్వటం ద్వారా, లేక కొన్ని పరిస్థితులలో చిన్న శస్త్ర చికిత్సద్వారా సరి చెయ్యగలరు.

ఈ సహాయం పెద్ద కంటి ఆస్పత్రులు గల పట్టణాలలో లభ్యమవుతుంది.

**వి. ఆర్. డి. పూనా.**

మా అమ్మగారికి 20 సం. లుగా మతిస్థిమితము లేదు. ఇంట్లోనే వున్నది. రోజూ కోపంగానూ, ఉద్రేకంగాను తిట్టుచూ, కొట్టుచూ నుండును. ఆమె ఏ డాక్టరినీ దగ్గరకి రానివ్వదు. తగ్గటానికి ఏమైనా మందు వున్నదా?

ఏ డాక్టరునీ దగ్గరకు రానీయని వారు, డాక్టరు సలహాను మాత్రం రానిస్తారా? రోగిని చూడకుండా — అందులోనూ మతి స్థిమితం లేని రోగిని— మందులు వ్రాయటం చాలా పొరపాటు. ఎలాగో తంటాలు పడి, దగ్గరలో ఉన్న వైద్యులను ఇంటికి రప్పించి చూపించండి.

—డా. కె. వేంకటేశ్వరరావు



# చిలకలు

యం. రామకోటి

*అబ్బబ్బ ! ఆవిడెవరోగానీ, బస్సెక్కం దగ్గర నుంచి వసబోసిన పిట్టలా ఒకటే వాగుడు.*

"యిదిగో అబ్బాయ్ ... కండక్టరూ ... తునికి ... తునికీ ... యీ వెధవకో అర టిక్కట్టూ ... నాకోటీనూ ..." కొంగు ముడి విప్పి పదిరూపాయలనోటు అందించింది.

యీదురు గాలిలా మనవణ్ణి యీడ్చుకుంటూ లోపలికెక్కి దారి కడ్డంగా నిలబడింది.

"అబ్బ! రొజ్జగాలి" పైటచెంగు ముసుగేసుకుని వెలితిగా దిక్కులు చూస్తోంది పూర్ణ.

ఈ వెల మొసలిమీదో, నాగుపాముల నాలికల్లోనో యెక్కడ పదునెక్కిందో గాని చలిగాలి జిల్లు జిల్లుమని దూసుకుపోతోంది. దెప్పుడు మాటల్లా గుండెలు దొలిచేస్తోంది.

తెల తెలవారుతోంది. అయినవాళ్ల పక పకల్లాగ హార్బరు అత్తరు దీపాలు మిడిసిపడి పోతున్నాయి. గుండెల్లో పేరుకున్న దిగుల్లాగ బస్సులో గుడ్డిదీపం మినుకు మినుకుమంటోంది.

చెవుల మీదకి ముసుగు లాక్కుంటోంది పూర్ణ.

మొహం చెల్లక లాగుంది మంచు ముసుగులో వెల వెల బోతున్నాడు వెర్రి మొర్రి చందమామ.

చుట్టూ మోతుబరుల నైటుక్లబ్బులూ, చవకబారు సానికొంపలూ నడిజాముదాకా తప్పతాగి తందనాలాడి ఒళ్లూపై తెలియకుండా ముసుగుదన్ని గురకలు పెడుతున్నాయి చెల్లాచెదారం చిదుకులేసి చలికాగుతున్నారు, పాసింజరు షెడ్డులో కాపరాలు చేస్తున్న ఆడామగా జనం.

నోట్లో అడ్డపొగలు పెట్టుకుని మోచేతులో డొక్కల్లో పొడుచుకుంటూ కళ్లతోనే యెకసెక్కాలాడుకుంటున్నారు.

చిదుకుల బతుకు సెగల్లో వెచ్చబడుతున్నారా దిక్కుమాలిన వాళ్లు. ఆ సెగల నాలికలు యెగసి యెగసి గుండెల్ని నాకుతున్నట్లు గిల గిల లాడుతూ జాలిగా చూసింది పూర్ణ.

నా గుండె కలవరబడుతోంది. కడుపులో దేవినట్టయి.

"ఏవమ్మా...కాఫీ తాగుతావా ?" అన్నాను ఫ్లాస్కు అందుకోబోయి.

"వద్దులే అన్నయ్యా" అన్నట్టు కళ్లు తిప్పేసుకుంది.

"యిదిగో అబ్బాయి ... టిక్కట్టిమ్మని యిందాకణ్ణించి వాపోతున్నానూ..వులకవేం?"

యీదురుగాలి జుయ్ జుయ్ మంటోంది.

"బస్సంతా కాలీగుంది ... కూసోండమ్మా యిత్తానూ" రేకుబల్లమీద ట్రిప్ షీటు రాసుకుంటూ టిక్కట్టు నెంబర్లు నోటు చేసుకుంటున్నాడు కండక్టరు.

ఒకరూ ఒకరూ సామాన్లు సద్దుకుంటు న్నారు.

"కూచోమన్నట్టు కూచోమంటారు ... మళ్లీ మధ్యదార్లో టిక్కట్లు లేనివాళ్ల దిగిపోవాలంటూ అల్లరి పెడతారు ... సిగ్గు సిగ్గు ...యీగోల నేపడలేను బాబూ..."

"యిత్తాలెండమ్మా సిల్లర్లేదు ... దారి కడ్డులెగండి" నిమ్మకి నీరెత్తినట్టు తోలు సంచి జాడించుకుంటూ పదులూ అయిదులూ పైసలు యేరుకుంటున్నాడు కండక్టరు.

"బామ్మా బామ్మా...ఎంచక్కా ముందు కూచుందాంవే ..." అంటూ మా వేపు చూపిస్తూ చెయ్యి విదిలించుకున్నాడు మనవడు.

కీ యిచ్చిన బొమ్మకారులా జామ్మని పరుగు లెత్తి ఒక్క గెంతులో మా ముందు సీటు మీద యెగిరిపడ్డాడు. నేలమీద కాళ్ళందక అటూ ఇటూ తూగుతూ సీటుమీద కుదుట పడుతున్నాడు. తప్పు తుప్పుమని బంతిలా తూల్తున్నాడు.

"ఒరే ఒరే ... నువ్వా ... ఆకతాయి వెధవ... సందు దొరికితేచాలు వుడయించ డానికి... నీ మెడకో కుక్కపటకా తగిలిం చేస్తానుండు" అంటూ మనవడి వెనకాలే పరుగులెత్తుకుంటూ మాముందుకొచ్చి.

"మా చెడ్డ అల్లరి వెధవ ... బాబూ కొంచెం చూస్తుండండీ ... వూగెంతులూ పరుగులూ... కొంచెం చూస్తుండండి నాయినా టిక్కట్లు పట్టుకొచ్చేస్తానూ..." అందావిడ.

"బామ్మా బామ్మా ... నేనీ అత్తయ్య దగ్గరే కూచుంటానే..."

"గడుసు వెధవా... అప్పుడే వరసకలిపే సేవూ..."

చింతపిక్కల్లా చిలిపికళ్లు చికిలించేడు కుర్రాడు గుండు గీయించినట్టున్నారూ, మొలకెత్తుతున్న క్రొరుజుత్తు రాగిరజన్లా మెరుస్తోంది.

బూరిబుగ్గలూ వాడూనూ. దుబ్బుగా దబ్బపండులా వున్నాడు.

బుగ్గలు నొక్కి ముద్దు పెట్టుకుంది పూర్ణ.

'ముద్దెట్టుకుంటే ముక్కట్టుకుంటాడ మ్మోశ్ ... పెంకి వెధవ ... " అందావిడ నవ్వుతూ, మనవడివేపు అభిమనంగా చూస్తూ.

# రాలిన ముత్యాలు

శ్రీ 'సోమసుందర్'

> మన జనాభాలో రెండు రకాలవాళ్లున్నారు
> మనుషులూ, పెద్దమనుషులూను
> మనుషులు పెద్దమనుషులు కారు
> పెద్దమనుషులు మనుషులూ కారు!★

## చిలకలు

చింకొట్టు జాంపండులా బొక్కినోరు చూపిస్తూ 'యీ' అని నవ్వేడు కుర్రాడు.

నవ్వి ఒళ్లోకి తీసుకుని బుగ్గలు చిదిమింది పూర్ణ.

"టిక్కట్లిస్తార్లెండి...కూచోండి ఫరవా లేదు" అన్నాను.

"పిల్లని నమ్మలేం బాబూ. ఓమారేంవైదంటే యిస్తాను కూచోమనీ అద్దాన పడివిలో లెక్క జూసుకుని బస్సాపి దిగిపో మన్నాడు వీడి మొహంమండా. బస్సు బస్సంతా తిరగబడి గోలపెడితే వూరు కున్నాడు గానీ. ఏ వైం పోదు నూ" నవ్వు కుంటూ కూచుందావిడ.

"మీ ఆయ.?" అనబోతోంది చీర సద్దుకుంటూ.

"మా అన్నయ్యండీ" అంది పూర్ణమ్మ మధ్యలోనే మాటందుకుంటూ.

నాకు చిరాకేసింది.

"అమ్మయ్యా ... యిప్పటికేనా నోరు మెదిపేవేతల్లీ ఏం ముత్యాలు రాలిపోతాయా? ఒడిబట్టి గుచ్చి మళ్లీ నీ మెడలోనే వేసేస్తాలే" ఆప్యాయంగా మాటకలుపుతోంది.

"బామ్మా బామ్మా" రెండు చేతుల్తోనూ ఆవిడ మొహం వాడివేపు తిప్పేసుకుంటు న్నాడు కుర్రాడు.

"అబ్బ! ఏవిట్రా నీ సోది"

నవ్వేసింది పూర్ణ.

"నవరత్నాలేం రాలిపోవు లేవమ్మా ... మాయమ్మ మాయమ్మే ... ఏదీ మరోమారు నవ్వూ.. వయసులో పిల్లలు నవ్వితే రెక్క లిప్పే మల్లిమొగ్గల్లా వుంటారమ్మా"

మొహం దించేసుకుంది పూర్ణ.

"అంత సిగ్గైతే ఎలాగమ్మా ... ఏదీ" గెడ్డం పట్టుకుని పైకెత్తుతోందావిడ.

పూర్ణ మొహం వాడిపోతోంది. నా మనసు చివుక్కుమంది.

వయసు మీరివడిలిపోతున్నా మగ్గిన మామిడిపండులా వుందావిడ. కచ్చబోసిన సన్న జలతారంచు చంద్రకాంత రంగు నేత చీరా, పలకసరులు మెలతబడ్డ మెడలో పగడాల తావళం, అరకాసంత కుంకంబొట్టూ ఒకదానిమీదొకటి పోటీపడి పండిపోతున్నాయి. పండిపోతున్నా పలచబడని నొక్కుల జుత్తు అక్కడక్కడ లొత్తలు బడుతోంది.

నిండుగా జబరుగా గెల వేసిన అరిటి దవ్వలా వుంది.

"యిదేంపిల్లలమ్మా...కళ కళ లాడుతూ నవ్వుతూనే మొహాలు ముడిచేసుకుంటారూ" నొచ్చుకుంటోందావిడ.

వరదొచ్చినట్టు మాటల్లో కొట్టుకు పోతోంది. చూస్తే పెద్దావిడా. ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తోచక వుక్కిరి బిక్కిరై చస్తున్నాను.

"అబ్బే ఏంలేదండీ" అన్నట్టు తెచ్చి పెట్టుకుని నవ్వింది పూర్ణ.

"అచ్చు అదీయింతే యిదే వాలకం ఏంరా బుజ్జీ మీ చిన్నత్తయ్యా యింతే కదురా?" పోల్చుకుంటూ మనవణ్ణి సాయం పిలుస్తోం దావిడ.

"అత్తయ్యా అత్తయ్యా మరేం మరేం" పూర్ణ మెడమీద లేత చేతులు పెనవేస్తు న్నాడు కుర్రాడు.

"ఏం?" అన్నట్లు చూసింది పూర్ణ.

"మరేం మరేం ... బామ్మేమో ... బామ్మేమో" ఆవిడవేపు చూస్తున్నాడు కుర్రాడు.

"వెధవనాన్నుడూనువ్వూనూ కబుర్లపోగు. చెప్పేదేదో అఘోరించు" మనవడి బుగ్గ పొడిచిందావిడ.

"తాండ్ర కొనిపెడుతుందోచ్చి" కొను క్కోబోయే తాండ్ర ముక్కల్ని తాయిలంలా గుప్పిళ్లలో దాచేసుకుంటున్నాడు.

"ఈ వెధవ బుర్రలో యేదిపడితే అది జరిగిపోవాలి...రామచంద్రప్రభో !...అందాకా ప్రాణాలు తోడేస్తాడమ్మా" మనవడి నెత్తి మీదో మొట్టికాయ మొట్టి. "అలాగేలేరా ... వూ జోరీగలాగ పోరు పెట్టకు" అని వాణ్ణి వూరుకోబెట్ట బోయిందావిడ.

"మరి పతికబెల్లంవో" అన్నాడు వాడు.

"మళ్ళీ అదోటే...మరింకేం బుక్కుడు గాని చిలక పిట్టలాగ."

"బామ్మా బామ్మా ... నాకు చిలకపిత్త కొనిపెత్తవే...ఊఁ-ఊఁ" మారాం చేస్తున్నాడు.

"ఓర్నాయినో...నేరకపోయన్నా నాబాబూ ...పీడి బుర్రలో యిదోటి దూరిందే ... బంకనక్కర కాయిలా వదల్డు ... ఏందారి దేవుడోయ్" దిగాలుపడి పోతోందావిడ.

ఉండబట్టలేక పక్కున నవ్వేసింది పూర్ణ.

"నవ్వు తల్లీ నవ్వు ... యీ గుంట వెధవని వెంటేసుకొచ్చిం తరవాత ఎన్నైనా పడాలి"

"అయ్యయ్యో...అదికాదండీ" అన్నట్టు బాధగా చూసింది పూర్ణ.

"నవ్వమ్మా...అలా నవ్వు తల్లీ...పట్టుమని పాతికేళ్ళుండవు...ఎందుకర్రా ఆ బెంగ చూపులూ?" అంటోందావిడ మొహం వింత చేసుకుని.

ఊరు దూరమవుతోంది. పొద్దు పొడుస్తోంది. మంచులా దిగులు కరిగిపోతోంది. పూర్ణ నవ్వుతోంది.

## చిలకలు

"అలా నవ్వినపుడు మీరేం . మీరూ..." అంటూ పూర్ణ పైటలోకి చూస్తూ.

"మీ ఆయన కేంపని?" అందావిడ.

"ప్రొఫెసరు..."

"అంటే ?"

"పెద్ద చదువులు చెబుతారూ...",

"ఓహో...అదా...ఎక్కడా ?"

"యూనివర్శిటీలో..."

"యింకేం పెద్దపనే...చిలకపిట్టని చూసి మరీ యెంచుకున్నాడల్లుడు...చందమావలా వున్నావుమరీ... చూస్తూ చూస్తూ యెలా వూరుకుంటాడెవడేనా?" అనీ పూర్ణ చెంపల్ని అరచేతిలోకి తీసుకుని అదిమి ముద్దెట్టుకుంటూ.

"దగ్గర సంబంధవా ?" అందావిడ.

"ఊఁ..." అని బుర్రూపింది పూర్ణ.

"అమ్మగారింటికెళ్తున్నావా ?"

పాలిపోయి నాకళ్ళల్లోకి చూస్తూ మొహం దించేసుకుంది పూర్ణ.

"లక్షణంగా పెద్దవాళ్ళ మాటవిని ... అయినవాళ్ళని చేసుకుని... హాయిగా కాపరం చేస్తున్నావు ... మా పిల్లా వుంది ... ఎందుకూ?" అని మెప్పికోలుగా నామొహంలోకి చూస్తూ కరుగుతున్న కంటిచివర, కొనగోటితో మీటుతోంది.

పూర్ణ వేపు చూడకుండా మాటాడేస్తోంది.

నా గుండె కరాలు కరాలు మంటోంది. దారినపోయే వాళ్ళందరికీ యెందుకో యీ వివరాలన్నీ. ఒళ్ళు మండిపోతోంది. ఆ వరదకి అడ్డు పడ్డం తెలియక "మీరు టిక్కట్లు తీసుకున్నారా ?" అన్నాను యేదో మాట మార్చాలని.

"అయ్యో నామతిమండా అపునుసుమా... మాటల్లో పడి మర్చేపోయేను... యిదిగో ఓ అబ్బాయ్..." కండక్టరు కోసం గావుకేక పెట్టిందావిడ.

"యిక్కడేవున్నా నెందుకమ్మా కేకలూ... యియ్యండి" నోటందుకుని టిక్కట్లు చింపి చిల్లరందించేడు.

బెర్తుమీద నిలబడిపోయి, పరదాలు ఎగదీసి, పూచలు పట్టుకుని వింతగా చూస్తున్నాడు కుర్రాడు.

"ఒరే ఒరే...నువ్వూ...దిగుతావాలేదా... కనుమరుస్తే చాలు... వెధవ నడికొప్పెక్కి కూచుంటాడు ..." మనవణ్ణి అదమాయిస్తోంది.

"అబ్బా... నేను చూత్తా నంతుంటే..." చెయ్యి విదిలించుకొని చిందులు తొక్కేడు వాడు.

అనకాపల్లిలో బస్సాగింది. ఇనప చక్కీల్లో కాఫీలు, టీలూ, గ్లాసులు పెట్టుకుని కేక లేస్తూ అమ్ముకుంటున్నారు. జంతికలూ, జీడిపప్పు,తాండ్రముక్కల్లూ వరసలు వరసలుగా పేర్చి జంగిడీలతో బస్సుమీదకెగబడుతున్నారు.

"బామ్మా బామ్మా ... అదిగో నే తాండ్రా... కొనిపెత్తవే..."

"ఉష్షు! ఈగలెలా ముసురుతున్నాయో చూడు... అవి తింటే జబ్బుచేస్తుంది బాబూ తుని వెళ్ళగానే నరసరాజుగారింటికి కబురంపే యిదిగో చూడూ... మా నాయినవికదూ ... యింత ... యిదిగో యింత అచ్చు తెప్పిస్తాను... ఏం?" చేటంత చేతులు చాపి చూపిస్తూ మణవణ్ణి మరిపిస్తోంది.

స్టేండంతా వెయ్యి కళ్లుపెట్టి చూస్తున్నాడు కుర్రాడు గారాలు గుడుస్తూనే.

"చిలకలు చిలకలు హోయి హోయి... చిలకలే బామ్మా చిలకలే..." యింతింత కళ్లు చేసుకుని చప్పట్లు చరుస్తున్నాడు.

"చచ్చేన్రా దేవుడా.. నీకంట బడ్డాయి" నెత్తి పట్టుకుందావిడ.

కుర్రాడి సందడి చూసేడు చిలకలవాడు. సులకతాడుతో మూడు వెదురు పంజరాలు గుత్తిలా వేలాడదీసుకుని.

"ఆఁ... సిలకలండీ సిలకలూ... మాటలు నేర్చిన సిలకలు బాబూ... పాటలుపాడే సిలకలండి... సింగారం సిట్టడివిలో... సింతల తోపులో... సివురుచేసి ... సీకూ సింతా నేక సెలాకీలు మరిగిన సిలకపిట్టలండి ... ఆఁ...సిలకలండీ... సినీమాల్లో ఏసం కట్టిన సిలకలు...సాగ్గిరి సేతిమీనా... ఓబేసి రైక మీనాసేరి కతలు సెప్పిన సిలకలండి...సిలకలు బాబూ..." చిన్న వరసపెట్టి లయబద్ధంగా పాడుతూ బస్సుదగ్గర తిరుగుతున్నాడు.

"పాటలు కూడా వచ్చుంటే బామ్మా... బామ్మా బామ్మాకొనిపెత్తవే..."ఆవిణ్ణినవిలి నప్పరించేస్తున్నాడు.

"నా మొహం...అంతా వుత్తవేరాబాబూ. నమ్మకు...మనం కొనాలనీ..."అంటోందావిడ

"ఏదిరా సిలకా... అమ్మగారు సూస్తారంట...యినిపించూ.."అంటూతలుపు తెరిచి పంజరంలోంచి ఓ చిలకని తీసి చూపుడువేలు మీద కెక్కించుకుని రెక్కలు దువ్వేడు.

"రామరామరామా..."అందిచిలకనాజూగ్గా

"పలుకాడితే సాల్దే సిలకా...పదం పాడవే బాగా..."ముక్కు చివర వేలుతో కొట్టి. రెచ్చగొట్టేడు.

"ఓహో ఓహో సిలకమ్మా... మారాలూ యెందుకమ్మా..మాటాడవమ్మా..ఓహోహో సిలకమ్మా..."నొక్కినొక్కి పాడి రెక్కలు రెపరెపలాడించింది.

వెట్టి చాకిరీ చేయించుకుంటున్నందుకు పంగి వేలుకొరికింది చిలక.

బఠాణీగింజ నోటికందించి పంజరంలో మూసేసి చిలకలు చిలకలంటూ బస్సుచుట్టూ తారట్లాడుతున్నాడు.

"బామ్మా బామ్మా...చిలకపిత్త లెలిపోతున్నాయే...కొనిపెత్తవే...ఊఁ ఊఁతాండ్రాలేదు చిలకపిత్తా లేదు...అబ్బ యేంతే నువ్వూ..." అని మారాం చేస్తూ రాగాలు తీస్తున్నాడు కుర్రాడు.

"చిలకని నువ్వేం చేసుకుంటావురా వెర్రి వెధవా..." పిర్రమీదొకటంటించింది.

"ఆఁ...ఆఁ...ఎంచక్కా మాతో మాతలాడుతుంది.పాతలు పాడుతుంది...అత్తయ్యా నేనూ ఆడుకుంతాం కొనిపెత్తవే బామ్మా... ఊఁ ఊఁ..."

"అవున్రోయ్...అమ్మ వెధవా...ఎంతాలోచన్రా నీకూ...అత్తయ్యతో ఆడుకుంటావా ?... పిలుపిలూ... ఓ చిలక అబ్బీ... ఓయ్..."

పీచు బేరాలు ఆడి ఆడి అయిదునుంచి మూడుకి దించి ఓ చిలక పంజరాన్ని మనవడికి అందించిందావిడ. పది పైసలు బఠాణీలుకొని వాడిచొక్కా జేబులో పోస్తూ.

"యివి చిలక్కి.. నీక్కాదు.. నువ్వు బుక్కేవంటే బుగ్గలు పాడిచేస్తాను వెధవయ్యా."

అనకాపల్లి దాటిపోయింది బస్సు. అన్నీ మరిచిపోయి బఠాణీగింజలు పంజరం సందుల్లోంచి చిలకకి పెడుతూ వుండుండి ఒకటీ ఒకటీ పటుకు పటుకు మనిపిస్తున్నాడు కుర్రాడు.

"అదిగో అదిగో...దొంగ వెధవా...దానికి పెట్టరా అంటే నువ్వే మింగుతున్నావా..." అభిమానంగా మనివడితల నిమిరిందావిడ చిలిపి



అందరికి స్వాతంత్ర్యంవచ్చి 28 ఏళ్ళయితే నీకిప్పుడు రావటమేవిటోయ్ ?

లేదు ! మా ఆవిడకు యివాళే విడాకులిచ్చా !!

---

నవ్వు రువ్వి.

"చిల్కాపిత్తా... చిల్కాపిత్తా... తింగు మన్నాదీ... అతా తెచ్చిన కొత్తకోకా కత్తా నన్నాదీ...

మావాతెచ్చిన మల్లిపూలు ముదవానన్నది మొగుదు చేతా మొత్తికాయిలు తింతానన్నాది...

చిల్కాపిత్తా చిల్కాపిత్తా తింగు మన్నాదీ..." బొద్దుచేతులు చరుచుకుంటూ మైమరిచి ఆడుకుంటున్నాడు కుర్రాడు.

"మొత్తం మీద మనవడు చిలక కొనిపించాడే" పూర్ణ నవ్వింది.

"రాలుగాయి వెధవ ... ఏం పట్టినా వుడుంపట్టే ... అయినా అమ్మాయి సరదా పడి మారుతుందనీ కొన్నాను..." అందావిడ

కనుబొమ ఎగరేసింది పూర్ణ

"మా చిన్నమ్మాయమ్మా ... నీలాగే చిలకలాగుంటాది ... దానికోసమే తుని వెళ్తాంట..."

ఏవిటన్నట్టు చూసింది పూర్ణ

"యీ వెధవయ్యకన్నా మంకుపట్టు దాన్ది ... పెద్దదవగానే ... ఇంట్లో ఛేతికందొచ్చిన మేనల్లుడున్నాడు కట్టబెట్టేయ్యండి అని నెత్తీ నోరూ మోదుకున్నాను... వింటేనా మహారాజా...ముస్తాబుచేసి కాలేజీకి పంపించేరు ... యింకేవుంది ... అక్కడో గుంటణ్ణిచూసి ... ఒడ్డూ పొడుగూ చూసి మతిపోయింది దానికి ... ససేమిరా వాణ్ణితప్ప మరోణ్ణి చేసుకోనని మంకుపట్టు పట్టుక్కూచుంది ... నోర్మూసుకుని బావను చేసుకుంటావా లేదా అని కూకలేస్తే ... అన్నహారాలు మానేసి మందగొడిగా పిచ్చిచూపులు

(32వ పేజీ చూడండి)

సీరియల్

# రాగవాహిని

ఆదూరి

వేంకటసీతారామమూర్తి

(గత సంచిక తరువాయి)

8

స్నేహితుడిని లేపి లేపి ఎంతకీ లేవకపోవడం చూసి ముసుగు తొలగించి ట్రాన్సిస్టర్ ఆన్‌చేసి ప్రసాద్ చెవిదగ్గర పెట్టాడు రజనీకాంత్.

'అబ్బబ్బబ్బ – వారానికొక్క ఆదివారం – ఈ రోజన్నా సుఖంగా పడుకోవద్దా ? రోజూ ఎలాగూ తప్పదు' ప్రసాదు.

'ఆదివారం కనుకనే లేపుతున్నాను– లేచి రెడీకా – మార్నింగ్‌షో పిక్చరుకు పోదాం.''

'ఇప్పుడు పిక్చరేమిటి సార్ నెల మధ్య...' ఈ మాట కళ్లు విప్పాడు ప్రసాద్.

''అదే వద్దన్నాను – నేను పిలిచినపుడు నీకు వేరే యే విధమైన అభ్యంతరాలూ వుండ కూడదు. బయల్దేరమంటే బయల్దేరటమే''

షేవ్ పూర్తి చేసుకుని స్నానానికి బయల్దేరాడు రజనీకాంత్.

తప్పదన్నట్లు లేచి దంతావధానం కానిచ్చి ఫ్లాస్కులోని కాఫీ తాగాడు ప్రసాద్.

రోజూ అయితే ప్రసాదే కాఫీ తయారు చేసి తను తాగి మిగిలింది ఫ్లాస్కులో పోస్తాడు. ఆదివారం మాత్రం ఆ డ్యూటీ రజనీకాంత్‌ది.

హోటల్ నుండి కేరేజీ తెప్పించు కుంటాడు రజనీకాంత్. పగటిపూట ఆఫీసు కేంటీన్‌లో తిని, రాత్రిపూట తనకు తోచింది వండుకుంటాడు ప్రసాద్. పక్క పక్క గదుల్లో ఎవరికివారు వున్నట్లే వున్నా చాల విషయాల్లో ఒక్కటిగానే మసలుకుంటారు వాళ్లిద్దరూ. కానీ వీళ్లిద్దర్నీ చూసిన మూడోవారికి వారి సంభాషణలో, సంబోధనల్లో ఓ ప్రత్యేకత కన్పిస్తుంది.

తన వయసు వాడే అయినా చదువులోనూ డబ్బులోనూ తనకంటే ఓ మెట్టు పైనుండటంవల్ల గౌరవంగా 'అండీ' అంటాడు ప్రసాద్ రజనీకాంత్‌ని. చనువుగా 'నువ్వు' అంటాడు రజనీకాంత్. ఈ విషయం మీద చాలసార్లు చర్చ జరిగినా ఎవరికివారు తమ అభిప్రాయలు మార్చుకోలేక వూరుకున్నారు.

టాయిలెట్ అయి యిద్దరూ రోడ్డు మీదికి వచ్చేసరికి తొమ్మిదయింది. ఇద్దరూ గబగబా అరోమాకెళ్లి కాఫీ టిఫినూ కానిచ్చి దగ్గరున్న కొత్త హాల్లోకి దూరారు. టిక్కెట్లు తీసుకుని లోపలి కెళ్లేసరికి ట్రయిలర్స్ చూపిస్తున్నారు.

ఇంటర్‌వెల్‌లో బయటకొస్తూ ఒక వ్యక్తిని చూసి పలకరించాలనుకొని వెంటనే వెనక్కు తగ్గాడు ప్రసాద్. అతనితో నవ్వుతూ మాట్లాడుతోందో అమ్మాయి.

ఆమె ఎవరైనదీ అర్థం కాలేదతనికి – పిక్చర్ బిగినయినా ప్రసాద్ మనసులో అదే ప్రశ్న–ఆనందరావుతో వున్నదెవరూ ? అని.

9

'పోస్ట్' అన్న కేకకు వీధిలోనికొచ్చి వుత్తరం అందుకుని వెనుకనున్న అడ్రసు చూసి ఆనందంతో తన గదిలోకి పరిగెత్తుకు పోయింది వర్ధని.

'వుత్తరం ఎవరిదగ్గర నుండమ్మా' విమల అడిగింది వంటింట్లోనుంచే –

'అమ్మదగ్గరనుండత్తయ్యా' అని, కవరు చింపి చదవటం మొదలు పెట్టింది.

అమ్మా వర్ధనీ–

నువ్వక్కడ బాగానే సర్దుకుపోతున్నట్లు తాతయ్య చెప్పారు. చాల సంతోషం. కానీ నువ్వులేని లోటు యిక్కడ మాకందరికీ తెలుస్తోంది. తమ్ముళ్ళిద్దరూ నీగురించే అడుగుతున్నారు – 'అక్కయ్య యిప్పుడు వస్తుంది ? లేకపోతే మేమే అక్కడకు వెళ్తాం' అంటూ మారాం చేస్తున్నారు – నాకు సరేసరి–అటు అన్నయ్య యిటు నువ్వు దూరంగావుంటే యీ చిన్న పిల్లలతో యిక్కడ గడపడం నిజంగా చాల దుర్భరంగా వుంది. అన్నయ్యని ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని చెప్పు– ఓటీలు ఎక్కువ చేస్తున్నానని రాశాడు. పనిలోపడితే నిద్ర, ఆహారంకూడ మరిచిపోయే మనిషి – అక్కడ తాతయ్య వాడినేమన్నా కేకలేశారా ?

వచ్చే నెలనుండీ ఎలాగైనా ఓ పాతిక పంపుతానంటూ రాశాడు. వచ్చేదే తక్కువ. అందులో వాడు తిని, యితర ఖర్చులు చూసుకుని మాకు పంపడం సాధ్యంకాదను కుంటున్నాను – ఆ విషయమే వాడికి రాశాను.

ఇక నీకు నేను చెప్పేదొక్కటే – ఇక్కడ నీ చదువు ఎలాగూ సాగలేదు– మామయ్యతో యీ విషయమై మాట్లాడు – తప్పక ఒప్పుకుంటాడు – యేమున్నా లేకపోయినా యీ రోజుల్లో ఆడపిల్లకు చదువు ముఖ్యం. ఆ విషయమై నేను నీకు చెప్పనక్కరలేదు.

ఇకపోతే రాజేశ్వరి పిన్ని పురిటికి వచ్చింది, ఇక్కడంతా సందడిగా వుంది. నీకు రావాలని వున్నా యీ పరిస్థితుల్లో యిక్కడకొచ్చి చేసేదేం లేదు – నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకుంటూ తరుచు వుత్తరాలు రాస్తూండు. మామయ్యనీ అత్తయ్యనీ అడిగానని చెప్పు.

—మాణిక్యమ్మ.

ఉత్తరం చదివి ఆలోచనలో పడింది వర్ధని.

తాతయ్య మాటలు అన్నయ్యమీద బాగా పనిచేశాయన్న మాట – కన్నకూతురికి తిండి పెడుతూ ఆదుకుంటున్నానని అందరిలో చెబుతూ తిరిగి అన్నయ్యను డబ్బు పంప

*జరిగిన కథ : 3*

వర్ధని తండ్రి రంగారావు బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తుంటాడు. చదువుకుని ఉద్యోగంచేసి 'కుటుంబాన్ని ఆదుకోవాలనే వుద్దేశ్యంతో తల్లి మాణిక్యమ్మని, స్నేహితుల్ని అందర్ని వదిలి విశాఖపట్నం వచ్చిన వర్ధనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సాహం లభిస్తుంది. వర్ధని అన్న ప్రసాద్ చిరుద్యోగి. వర్ధనితో మెట్రిక్ కట్టించాలని నిశ్చయిస్తారు రాజశేఖరంగారు.

మనడం యేం బాగాలేదని పించింది. వింత తండ్రయినా అక్కడుండడ్డం తల్లికి చెరే. యేదో విషయంమీద భర్తనో, కొడుకునో పిల్లలనో తల్లి ముందు నిందించడం తాతయ్య కలవాటు. దాని కలవాటు పడాలంటే ఎంతో సహనం అవసరం — రోజులు కలిసొస్తే వీటన్నిటికీ ఒకే ఒక్క పరిష్కారం. తల్లినీ, తమ్ముళ్లనీ తీసుకొచ్చి అన్నయ్య దగ్గరే వుంచడం. కన్నబిడ్డకు చేసే సాయమేదో ఎక్కడున్నా చెయ్యొచ్చుగా. ఆ పంపేదేదో పంపితే అన్నయ్య జీతానికి తోడయి వేన్నీళ్లకు చన్నీళ్లలా వుంటుంది.

## *10*

వంట్లో నలతగా వుందని మధ్యాహ్నం మూడుగంటలకె ఆఫీసు నుంచి వచ్చి నిద్ర పోయారు రాజశేఖరంగారు. మహిళా భవన్‌లో యేదో మీటింగ్ వుందని వంట త్వరగా పూర్తి చేసుకుని మామయ్య లేస్తే కాఫీ టిఫిన్ యేర్పాట్లు చూడమని వర్ధని కప్పగించి వెళ్లింది విమల.

తీరుబడిగా స్నానం చేసివచ్చి బట్టలు మార్చుకుంది వర్ధని — జడ వేసుకుని సన్న జాజుల దండ తలలో తురుముకుంది — బొట్టు పెట్టుకుంటూ అద్దంలోకి చూసి ఒక్కక్షణం అలానే వుండిపోయింది. తెల్ల పువ్వుల వోణీ తన కెంతగానో నప్పింది — తనకు నచ్చింది కూడా. మొదటిసారిగా అన్నయ్య తన అభిరుచి ననుసరించి కొన్న వోణీ అది.

తలుపు తట్టిన శబ్దమైతే పరుగెత్తుకు వెళ్లి తీసింది - ఎదురుగా పుస్తకాలతో ఆనంద రావు. వర్ధని వంక ఓసారి చూసి చిన్నగా నవ్వి తన గదిలోకి వెళ్లిపోయాడు — సాధారణంగా ఆ సమయంలో ఆనందరావు యింట్లో వుండడు—ఒక్కోప్పుడు కాలేజీ నుండే ఎటో వెళ్తాడు.

తలుపుమూసి వంటగదిలోకి వెళ్ళి ఆనంద రావు బాత్ రూంకి వెళ్లిన సమయంలో అతని గదిలో కాఫీ టిఫినూ సిద్ధం చేసింది వర్ధని.

ఆనందరావుకి కాఫీకైనా భోజనానికైనా వంటగదిలో కెళ్ళడమే అలవాటు—విమల అలా అలవాటు చేసింది- బాత్ రూం నుంచి తిరిగొస్తూ వంటింట్లోకి తొంగిచూసి ఎవరూ లేకపోడంతో తిన్నగా తన గదిలో కొచ్చి చూసి ఆశ్చర్యపోయాడు.

బట్టలు మార్చుకుని 'వదినా' అంటూ పిలిచాడు. క్షణంలో వర్ధని ఎదురుగానిలిచింది.

''వదిన లేదా?''

''మహిళాభవన్ కెళ్లింది'' తలెత్తకుండానే జవాబు చెప్పింది—ఆనందరావు కొంచెం ఇక మకపడ్డాడు.

''టిఫిన్ యిక్కడికెందుకు ? అక్కడికే వచ్చేవాడినిగా.'' వర్ధని యేం మాట్లాడలేదు తలొంచుకుని అలాగే నిలబడింది.

ఆనందరావుకి మరేం పాలుపోక 'అక్కడ నించి తెచ్చి పెట్టడం శ్రమకదా' అన్నాడు.

'యేం లేదు—ఇక్కడైతేనే బావుంటుందని తెచ్చా' అని క్షణంచూసి వెనుదిరిగింది.

టిఫిన్ కావిచ్చి వీధిలోకి వెళ్ళిపోతూ 'నే వెళ్తున్నా వర్ధనీ తలుపేసుకో'అంటూ వర్ధని గదిలోకి తొంగిచూసి చిన్నగా కేకపెట్టాడు.

చదువుతున్న పుస్తకాన్ని అక్కడవదేసి లేచి అతని వెనుకే గుమ్మం వరకూ వెళ్ళి తలుపు వేయబోతూ అలానే నిల్చుండి పోయింది—

గళ్ళ బెల్ బాటమ్ ఫేంటూ—దానిమీదకు పువ్వుల స్ట్రైపుల షర్టూ—ఎవరికైనా యిట్టే ఆకర్షించే పర్సనాలిటీ — వీటన్నిటినీ మించిన చదువు-

'దేనికైనా అదృష్టముండాలి' అనుకుంది.

మరో పావుగంటలోనే లేచారు రాజశేఖరం గారు. ఎదురుగా టేబిల్‌మీద మడిచివున్న కాగితాన్ని తీసి చదివి, లేచి ముఖం కడుక్కున్నారు — సాధారణంగా విమల బయట కెక్కడికన్నా వెళితే ఒక కాగితంపై వ్రాసి మరీ వెళ్తుంది—అలాగే విమల యింట్లోలేని సమయాల్లోగాని ఆమె పడుకున్నప్పుడుగాని రాజశేఖరంగారు ఎక్కైనా అర్జంటుగా వెళ్ళాలన్నా అదేపని చేస్తారు-వారిద్దరిమధ్యా వున్న అండర్‌స్టాండింగ్ అది.

టిఫిన్ పూర్తిచేసి మేడమీది గదితలుపులు దగ్గరకువేసి కిందకుదిగిన రాజశేఖరంగారు సరాసరి వర్ధని గదిలోకి దారితీశారు. చదువుతున్న ఇంగ్లీషు పుస్తకం క్రింద పెట్టేసి లేచినిల్చుంది వర్ధని.

''కూర్చోమ్మా — అన్నట్టు నీతో ఓ విషయం మాట్లాడాలి. మెట్రిక్‌కి వెళ్ళటాని కేదో ట్యుటోరియల్ కాలేజీ తెరుస్తున్నారట— రెండునెలల్లో అందులో జేరొచ్చునని ఆనంద్ చెప్పాడు. ఇక యీలోగా నీకున్న స్టాండర్డ్ యేమిటో తెలుసుకుని కాస్త అన్ని సబ్జెక్ట్స్)



టచ్‌లో వుంచుకోడం మంచిది. నీకు తెలియనివి ఆనంద్‌ని అడిగి నేర్చుకో. యేమంటావ్'' రాజశేఖరంగారి మాటలకు తలూపి 'అలాగే మామయ్యా' అంది.

వర్ధనికిప్పుడు పట్టరాని సంతోషంగా వుంది — ఎన్నాళ్ళ తర్వాతనో తన కలలు ఫలిస్తున్నాయి. మళ్ళీ తను స్కూలుకు వెళ్ళి చదువుకుంటుందనుకుందా ? తాతయ్య, అమ్మమ్మ వుంటే ఎలాగూ పడనివ్వరు.

ఆడపిల్లకు చదువెందుకురా. ఎవడినో ఒకణ్ణి చూసి ముడిపెట్టి పంపెయ్యక — అని అడ్డు చెప్తారు. ఆ అడ్డంకూడ యిప్పుడు లేదు — మనసులోనే రాజశేఖరంగార్కి ధన్యవాదాలర్పించుకుంది.

''అన్నట్టు మీ అమ్మదగ్గరనుంచి వుత్తర మొచ్చింది — అంతా క్షేమమేనట —వీలుంటే ఓ వుత్తరం రాయి మీ అమ్మకి'' అంటూ వెళ్ళబోయిన ఆయనవంక చూసి 'మామయ్యా' అంటూ నసిగింది.

'యేమ్మా' అన్నారాయన వెనక్కు తిరిగి.

'అన్నయ్య దగ్గర ఓ రెండు రోజులుందా మనుకుంటున్నాను మామయ్యా.'

రాజశేఖరంగారు చిన్నగా నవ్వి.

''అదా — ఆ మాత్రందానికే అంత సందేహం దేనికమ్మా — వెళ్ళిరా'' అని వెళ్ళిపోయారు.

## 11

''ఈయనే రజనీకాంత్''

''ఈమె నా చెల్లెలు వర్ధని'' ఒకరినొకరికి పరిచయం చేశాడు ప్రసాద్.

'చాల సంతోషమండీ' అన్నాడు రజనీకాంత్.

'మీగురించి అన్నయ్య చెప్పాడు' అంది వర్ధని.

ఆమాటా యీ మాటా మాట్లాడాక ''ఈ రెండు రోజుల్లోనూ మీ అన్నయ్యకు మంచి మంచి పిండివంటలు వండిపెట్టండి'' అన్నాడు రజనీకాంత్.

''నా పేరు చెప్పి మీరుకూడ తిందామనా? అదేం లాభంలేదు. యీ రెండు రోజులూ మీరు నాకు గెస్టు'' అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

''నిజమే — ఈ రెండు రోజులైనా ఆ హోటల్‌కి స్వస్తి చెప్పండి'' అంది వర్ధని కల్పించుకుని.

ఆతనింకా యేదో అనేలోగానే ''సంకోచించనక్కరలేదండోయ్ — మా చెల్లాయి బాగానే వండుతుంది' అన్నాడు రామం.

''అరే! అదృష్టం కాళ్ళదగ్గరకొస్తుంటే తప్పేదేముంది ?'' నవ్వేశాడు రజనీకాంత్.

ఆరోజు ఆదివారం. వర్ధని వస్తోందని ఆ మర్నాటికి కూడ సెలవురాసి ముందు రోజే యిచ్చి వచ్చేశాడు ప్రసాద్.

''యేమిట్రా అన్నయ్యా సంసారివి కాకపోయినా నీగది మాత్రం బ్రహ్మచారి గదిలా లేదు'' అంది వర్ధని. అన్ని సామాన్లూ డబ్బాలూ అందంగా అమర్చి వుండడం చూసి.

''యేదోనమ్మా వే నెలావున్నా, నువ్వొచ్చినపుడన్నా అన్నీ యింట్లో వుంచకపోతే ఎలా?''

''అదికాదు — మీరొచ్చినపుడన్నా అన్నీ చేయించుకుని తినకపోతే ఎలా అని'' సవరించాడు రజనీకాంత్.

ముగ్గురూ నవ్వుకున్నారు.

స్నేహితులిద్దరూ కాస్సేపు పేకాడేసరికి వంట రెడీచేసి భోజనానికి పిలిచింది వర్ధని.

''మీరుకూడ పెట్టేసుకోలేకపోయారా ? యిందులో పైవారెవరూ'' అన్నాడు రజనీకాంత్ కూర్చుంటూ.

'ఫర్వాలేదులెండి' అంటూ యిద్దరికీ కొసిరి కొసిరి వడ్డించింది. ప్రతి వంటకాన్నీ మెచ్చుకుంటూ సుష్టుగా భోంచేశారు స్నేహితులిద్దరూ.

ప్రసాద్‌ని చూస్తుంటే జాలేసింది వర్ధనికి. అయినవాళ్ళందరికీ దూరంగా వుద్యోగం చేసుకుంటూ వంటరిగా వుంటున్నాడు. రేపు తాతయ్య 'నావల్లకాదు-' అంటే గంపెడు సంసారాన్ని నెత్తినేసుకొని యీదవలసినవాడు.

కళ్ళనీరు గిర్రున తిరిగింది.

ముందురోజు నైట్‌డ్యూటీ చేసి వుండటాన్ని భోజనాలు తర్వాత కాస్సేపు మాట్లాడి నిద్రలోకి జారిపోయాడు ప్రసాద్. రజనీకాంత్ తన గదిలోకిపోయి యేదో పుస్తకం చదువుకుంటున్నాడు. భోజనం కానిచ్చి వంటరిగా కూర్చున్న వర్ధనిలో మళ్ళీ ఆలోచనలు మొదలయ్యాయి.

లేచి డాబామీదకొచ్చి పిట్టగోడకానుకుని నించుంది-ఎండ తీక్షణంగా వున్నా సముద్రం మీంచి వీచే చల్లగాలి మాత్రం హాయిగావుంది. గది లోపలికి వస్తునదల్లా ఆగి, వెనక్కుతిరిగి రజనీకాంత్ గదిలోనికి తొంగిచూసింది. ఈజీ ఛైర్‌లో కూర్చుని చదువుకుంటున్నాడతను. అలికిడికి తలెత్తి ''రండి రండి యీ బ్రహ్మచారి గృహం పావనం చేయండి'' అంటూ ఆహ్వానించాడు.

''మరేంలేదు—యేం తోచకుండావుంటే... పుస్తకాలేమైనా వున్నాయేమోనని...''అక్కడే నిలుచుండిపోయి అంది.

''ఓ! అదా-' అంటూ బీరువాలోంచి రెండు పుస్తకాలు తీసియిచ్చి ''మొత్తానికి లోపలికి రాకుండానే మీపని మీరుచేసుకున్నారు అన్నాడునవ్వి. పుస్తకాలు అందుకుంటూనవ్వి, ''రావాల్సి వచ్చినపుడుతప్పకుండా వస్తానుగా'' అంది.

గదిలోకొచ్చి చాపమీద నడుంవాల్చి పుస్తకాలు తెరచిన వర్ధనికి అవి మామూలుగా చది పుస్తకాలుగా కన్పించలేదు—భాషలోనూ శిల్పం



# రాగ వీచికలు

లోను ఎత్తుగడలోనూ ఎంతో విశిష్టత కనబరచిన రచనలవి.

నిద్రనుండి లేస్తూనే 'యేమిటమ్మా- నిద్రపోలేదూ'అన్నాడు ప్రసాద్.

'లేదన్నయ్యా పగటిపూట నిద్రమాని చాలరోజులయింది-'అంటూ చదువుతున్న పుస్తకాన్ని మూసి కాఫీ చేసే ప్రయత్నంలో మునిగిపోయింది.

'రజనీ కాంత్‌లా. నీకూ పుస్తకాల పిచ్చి పట్టిందేమిటి? రూంకొచ్చిన ప్రతివారిచేతా చదివిస్తాడాయన''

''లేదన్నయ్యా- తోచకపోతే నేనే అడిగి తీసుకున్నాను.''

''యేమిటోయ్-నామీదేదో నింద వేస్తున్నావ్' అంటూ వచ్చాడు రజనీకాంత్ అతన్ని చూసి నవ్వేసి తలొంచుకుంది వర్ధని.

''యేంలేదు. మీ సాహిత్యమంతా అప్పుడే మా చెల్లెలి నెత్తిని రుద్దేస్తూంటే...''

''అదా – దానికి నేనేం బాధ్యుణ్ణి కాను'' అని, ''యింతకీ యేమైనా ప్రోగ్రాం ఫిక్స్ చేశావా లేదా'' అంటూ వర్ధనివైపు తిరిగి ''యేవండీ – సినిమాకి తీసుకెళుతున్నాడా లేదా మీ అన్నయ్య'' అన్నాడు.

కాఫీ తెచ్చి అతని కందిస్తూ.

''సినిమాలంటే నాకు పడదు – వాడు తీసుకెళ్లినా నే వెళ్లను'' అంది వర్ధని.

''పోనీ బీచ్‌కి''

''అది బాగుందే వర్ధనీ – వంట కాకపోతే హోటల్‌కి పోదాం'' అన్నాడు ప్రసాద్.

''మీ అన్నయ్య మంచివాడేనండోయ్ – చెల్లాయికి ఎక్కడ కష్టం కలుగుతుందోనని హోటల్‌కి పోదామంటున్నాడు.''

''వంటేముందండీ – మీరిద్దరూ తయ్యారయ్యేసరికి రడీ-ఎంతసేపు వండాలేమిటి?''

''అయితే సరే. తెములు'' అన్నాడు ప్రసాద్.

''మధ్య నేనెందుకండోయ్ పానకంలో పుడకలా'' రజనీకాంత్ మాటలకడ్డొచ్చి.

''నామూలంగా మీరు విడిపోడం నాకేం యిష్టంలేదు – మీరూ రావాల్సిందే.''

ఈ రోజు భోజనం ఖర్చు, కాఫీ ఖర్చు మిగిల్చారు – మీ మాటను కాదనగలవా.''

నవ్వుతూ తన గదిలోనికి వెళ్లిపోయాడు రజనీకాంత్.

[ఇంకా ఉంది

# హైదరాబాద్ నోట్ బుక్

## ముఖ్యమంత్రి ముందడుగు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఎలాటినష్టపరిహారమూ కోరకనే తమ మిగులు భూమి 60 యకరాలు అగస్టు 15 నాటికి ప్రభుత్వానికి స్వాధీనం చేయదలచడం అభినందనీయం. ఆయన అభ్యర్థన మేరకు తక్కిన మంత్రులూ ఆయనను అనుసరించి ప్రజలకు నిజమైన నాయకులు కాగలరని ఆశించవచ్చు. మిగులు భూములు 10 లక్షల ఎకరాలవరకు ఉండగలదని ముఖ్యమంత్రి తెలియజేశారు. ఇది పేదలకు పన్యంగా పంపిణీ కాగలదనడం నిస్సందేహం.

## శ్రీ మండలి

విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావును గురించి నా మిత్రుడు, సహ పత్రికా రచయిత వేమూరి వెంకట నరసింహరావు చెబుతుండగా తరచు వింటున్నాను, ఇటీవల నాలుగు సంవత్సరాలుగా చూస్తున్నాను, చూస్తున్న కొద్దీ ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది, ఈ వ్యక్తిలో ఇంతటి క్రియాశీలత్వం, చైతన్యోద్గారం ఎక్కడినుంచి పుట్టుకు వస్తున్నాయా అనీ., అలసట అనేది లేదా అనీ ! అవును ! గాంధితత్త్వం జీర్ణించిన తండ్రి శ్రీ వేంకట్రామయ్యగారి శిక్షణ, నిరంతర కార్యశీల అయిన తల్లి శ్రీమతి మహాంకాళమ్మ వాత్సల్యామృతం ప్రసరించినప్పుడు ఫలితం అన్యధాగా ఎలా వుంటుంది ? అని సరిపెట్టుకొన్నాను. పదవి కోసం తాపత్రయపడక, నిరంతర ప్రజాసేవా దీక్షతో, ఉన్నదానిలో మూడువంతులు హరిజనులకు పంచిపెట్టిన త్యాగనిరతిలో క్విట్ ఇండియా ఉద్యమంలో అజ్ఞాతవాసంలో కార్యకలాపాలు కొనసాగించిన పరాక్రమంతో కృష్ణా జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షుడై యువకులను నడిపించిన కీర్తితో, నిర్మాణ క్రియాదక్షుడై ఆదర్శప్రాయంగా ''గాంధిక్షేత్రాన్ని'' రూపొందించిన కౌశలంతో, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా పొందిన శ్లాఘతో, సంఘ సేవా మంత్రిగా, సమైక్య సాధకుడుగా, విద్యామంత్రిగా అందుకొన్న ప్రశంసలతో, అన్నిటినీమించి ప్రపంచ తెలుగు మహాసభలను అపూర్వంగా నిర్వహించి తెలుగువారి హృదయ కేదారాలలో పూయించిన సౌభ్రాత్ర సుమాల సౌరభంతో ప్రజలమనిషి అయిన మండలిని ఎంతదండిగా పొగడినా మెండనిపించదని ప్రతి తెలుగువాడూ ఒప్పుకుంటాడు. తెల్లవారి

సూర్యునికి ముందే పంచ పవన ఉషః కాలంలో లేచి, భగవంతుని, గాంధి మహాత్ముని స్మరించి నిత్య కృత్యాలు, ప్రజావిధులు, ప్రారంభించి, విరామం, విసుగులేక అర్ధరాత్రివరకు పనిచేసి, భగవంతుని స్మరించి నిద్రపోతూ, జీవితంలోనూ, సమాజ దృక్పథంలోను, ప్రభుత్వపాలనలోను గాంధేయ సిద్ధాంతాలకు అత్యంత ప్రాధాన్యమిచ్చి, వాటిని ఆచరణలో పెడుతున్న మండలి ఆగస్టు 4 వ తేదీకి అర్థశతాబ్ద వయస్సులో ప్రవేశించారంటే నాకు నమ్మకమే కలుగడంలేదు, నవనవోత్సాహం నిత్యనూతనంగా పొంగులువారే అలనాటి యువజన నాయకులుగానే కానవస్తారు. నేల నాలుగు చెరగులావున్న తెలుగువారిని ఒక్క వేదికపై సమావేశపరచడానికి ప్రయత్నించి కృతకృత్యులైన మండలి, యావదాంధ్రావళి ప్రేమ గౌరవాలు చూరగొన్న మండలి, విద్యార్థులు స్వయం కృషితో జ్ఞానార్జనచేసి, అర్హత సంపాదించుకోవాలేగాని, అవినీతికి పాల్పడితే జీవితమంతా అవినీతి కలుషమవుతుందని, వారికి నచ్చజెప్పి, సవ్యమార్గాన్ని నడిపించిన విద్యార్థి నాయకుడు మండలి కనీసం మరి ఏబదేండ్లు ఈ ఉత్సాహాతిశయంతోనే, ఈ నవ చైతన్యంతోనే, ఈ కార్యపటుత్వంతోనే ప్రజా సేవలో మునుగడ సాగించాలని నేను హృదయ పూర్వకంగా, తక్కిన ఆంధ్రావళితోపాటు ఆకాంక్షిస్తున్నాను.

### విద్యార్థుల సంక్షేమం

రాష్ట్రంలో విద్యార్థుల సంక్షేమం, ముఖ్యంగా విశ్వవిద్యాలయావరణలలోను, కళాశాలల్లోను ఉన్న విద్యార్థుల సంక్షేమం కోసం తీసుకోవలసిన చర్యలను గురించి ప్రధాని వింశతి సూత్ర కార్యక్రమం దృష్ట్యా జులై 5వ తేదీన విశ్వవిద్యాలయ కులపతులు, విద్యా శాఖ ఉన్నతోద్యోగుల సమావేశంలో చర్చించబడింది. పాఠ్య పుస్తకాల, నోటు బుక్కుల సరఫరా, వసతి గృహాల సక్రమ నిర్వహణ, సాంస్కృతిక క్రీడా, సాంఘిక కార్యకలాపాల కార్యక్రమాలు విద్యార్థుల అభిరుచులకు అనుగుణంగా నిర్వహించడం మొదలయిన విషయాలు చర్చకు వచ్చాయి. వీటన్నిటినీ నిర్వహిస్తామని మూడు విశ్వవిద్యాలయాల కులపతులూ హామీ యిచ్చారు.

### ఉపశ్రుతి

"ఏమిటండీ, ఇంజనీరింగ్ కాలేజీ ముందు విద్యార్థులే కనబడరేమండీ, నిరుడు ఈ రోజులలో నిరంతరం కనిపిస్తూ, వచ్చిపోయే బస్సుల చుట్టూ చేరిగోలచేసేవారే ?" అని అడిగాను ఒక లెక్చరర్ను. "అయ్యో, అది పాత జమానా ఇది నయాజమానా, తొమ్మిది పీరియడ్లూ క్లాస్‌రూము కదలడం లేదు విద్యార్థులు" అన్నారు.

—తిరుమల రామచంద్ర

# ఫాలాక్షుని డైరీ

## ఉతికినా పోని అదృష్టం !

కలకత్తాలో ఒకతను వో లాటరీ టిక్కెట్టు కొని అది జేబులో మర్చిపోయి, ఆ లాగూను చాకలికి వేశాడట. అతడావిధంగా ఆ లాగూను చాలా సార్లు ఉతికించేశాడట. ఆ టిక్కెట్టు నలిగి, పిండిగా అయిపోయిందట. తీరా దానికి మొదటి బహుమానం లక్ష రూపాయలూ వచ్చిందట. దాంతో ఆతను ఆ టిక్కెట్టును శక్తికొద్దీ సాపు చేసి ప్రభుత్వానికి దాఖలు చేస్తే, సదరు ప్రభుత్వం పదహార్నెలలు దానిమీద విచారించి, చివరికి తల పంకించి, పన్నులు పోగా అతనికి 81,875 రూపాయలు యిచ్చేశారట— రామరాజ్యమనవేది!!

## ఆపరేషన్ తర్వాత ఆడతనం !

పోయినేడు జులై పదో తేదీన కలకత్తాలోని వో ఆసుపత్రిలో 16 ఏళ్ల తపతీమండాల్ అనే ఆమెకు 35 ఏళ్ల ఆవిడొకతె దానం చేసిన వోవరీ (స్త్రీ జననేంద్రియ సంబంధమైనది) లతో అక్కడి డాక్టర్లు తపతీ మండాల్‌కు ఆపరేషను చేశారట. ఆమెలో యిప్పుడిప్పుడే స్త్రీత్వపు చిహ్నాలుకనిపిస్తున్నాయని అస్సలేమాత్రం ఎత్తుపల్లాల లేని ఆమె వక్షం ఇప్పుడు చక్కగా ఎదిగిందని, అంతేగాక తపతీమండాల్ ఎత్తు, బరువు, తదితర కొలతలు సంతృప్తికరంగా ఉన్నాయని కలకత్తాలోని ఆ ఆసుపత్రికి చెందిన డాక్టర్ ఘోషాల్ సంతోషవార్తగా ప్రకటించారట.

## అన్నదానంలో తొక్కిసలాట నలుగురి మరణం!

నెల్లూరులో లలితా హెబ్బార్ అనే వో డాక్టరు చనిపోయిన తన తండ్రి జయంతి జరుపుతూ అన్నదానం చేశారట. ఈ అన్నదాన సందర్భంలో జరిగిన తొక్కుళ్లాటలో వో ఏడేండ్ల కుర్రాడు, డెబ్బయి ఏళ్లవాళ్లిద్దరు ఆడవారు, డెబ్బయి ఏళ్ల ముసలాయనా చనిపోవడమే గాక బోలెడుమంది నలిగిపోయారట. ఈ అన్నదానంకి నాలుగు వేలమందిసుమారు వచ్చారుట.

* * *

చాటపర్రులో జూలై ఒకటో తేదీన వంట చేస్తున్న 22 ఏళ్ల చింతా రామతులశమ్మ అనే ఆమెకు మూర్ఛవచ్చి అట్టే పడిపోయిందట. పక్కనున్న స్టౌ వొరిగి, ఆమె చీరకు నిప్పంటుకుని స్పృహ వచ్చేలోగా ఆమె కాలి, చనిపోయిందట పాపం !

# ధర్మపధం —బులుసు వేంకటరమణయ్య.

## సంసారులు-సన్యాసులు

నాడు సన్యాసులు మునివృత్తి నవలంభించి అడవులలో తపస్సు చేసుకుంటూ జనానికి దూరంగా ఉండేవారు. అయినా జనులు వచ్చి తమ్మ సలహాలను అడిగినప్పుడు హితాన్ని బోధించేవారు. రాజ్యాంగంలో ఏ చిక్కులు సంభవించినా, వాటి పరిష్కారంకోసం రాజులు వారి సలహాల ప్రకారం నడుచుకొని, ఆ సమస్యలను పరిష్కరించుకొనేవారు. పోతే — ధర్మప్రచారానికీ, తీర్ధయాత్రలకూ దేశ సంచారం చేసే సన్యాసులకు గృహస్థులు భిక్ష పెట్టి గౌరవించేవారు. యతులను పూజించడం తమ ధర్మమని బాగా తెలుసుకునే వారు.

కాలం మారిపోయింది. రత్నగర్భ అని పేరు పొంది యితర దేశాలకు ఆహారధాన్యాలు సరఫరాచేసే భారతదేశం తిండికి ఇతర దేశాలపై ఆధారపడవలసి వచ్చినది. ఈ స్థితి మనకు బ్రిటిష్ పాలనలో శతాబ్దంక్రిందటే ఏర్పడింది. సర్వమత మహాసభకు షికాగోకు వెళ్ళిన స్వామి వివేకానందులు "మీకు భారత దేశాన్ని ఉద్ధరించే సంకల్పం ఉంటే మత ప్రచారానికి ప్రవక్తలను పంపవలసిన అవసరం లేదు. ఆ విషయంలో ఇతర దేశాలకంటె అది సమృద్ధమయి, ఇతరదేశాలకు, మేలైన సందేశాలిచ్చే స్థితిలోనే ఉన్నది. కావలసినది తినుటకు తిండి, కట్టుటకు గుడ్డ. వాటికి మీరు చేయవలసినది ఆర్థిక సహాయం మాత్రమే" అని ప్రార్థింపవలసి వచ్చింది. తిండికీ, గుడ్డకూ బాధపడుతున్న ప్రజలకు మతాన్ని గురించి చెప్పితే ఎలా తల కెక్కుతుంది? మొదట వారికి కనీసపు సౌకర్యాలు ఏర్పడాలి. ఈ విషయాన్ని గ్రహించిన వివేకానందులు భారతదేశంలోనే కాకుండా ఇతర దేశాల్లో కూడా రామకృష్ణ పరమహంసపేరిట మతాలను స్థాపించి ప్రజాసేవకు స్థిరమైన ఏర్పాట్లు చేశారు. ఈ విధంగా ఆధునిక యుగంలో సన్యాసులే నిస్సహాయులైన ప్రజల అవసరాలు తీర్చుటకు తగిన బాధ్యత వహించవలసి వచ్చింది.

ప్రజాసామాన్యం ఆరోగ్యం, విద్య, ఆహారం, మున్నగు వాటి విషయంలో శ్రీ రామకృష్ణ మిషన్‌వారు చేస్తున్న సేవ సాటి లేనిది. అతివృష్టి, అనావృష్టి, ఆకస్మికంగా ఏర్పడ్డ ప్రమాదం మున్నగునవి తటస్థించినపుడు ప్రజలను ఉద్ధరించడానికి కార్యరంగంలో ముందడుగు పెడుతున్నది వీరే అని అందరికీ తెలుసును.

ఈ విధంగానే మతత్రయంవారి మఠాలు, ఆశ్రమాలు, ఇతర మతస్థుల నిలయాలు జనసంఘానికి చేసిన.— చేస్తున్న సేవలు అమూల్యమైనవి.

సన్యాసులకు — శరీర రక్షణకు స్వల్పమైన ఆహారం — సాత్వికాహారం తప్ప మరేమీ అక్కరలేదు. వారు కోరుతున్నదీ ప్రజాక్షేమం! పాటుపడుతున్నదీ ప్రజాక్షేమం కొరకే!

సీరియల్

# జీవేదం

పోలాప్రగడ రాజ్యలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

రాత్రి గెస్ట్ హౌస్‌లో పడుకున్న లీలకి యెంత సేపటికీ నిద్దరే పట్టలేదు. పక్క గదిలో మురళి హాయిగా నిద్దరపోతున్నట్లున్నాడు. పరుపుమీద కాస్సేపు అటూ యిటూ దొర్లి, తర్వాత వరండా లోకి వచ్చి వెన్నెట్లో తళతళా మెరుస్తున్న కృష్ణా నదిని చూస్తూ నిలబడింది. వరండాలో తను నిలబడ్డచోట కూడా కొద్దిగా వెన్నెల పడుతోంది. కృష్ణానది అందాన్ని కళ్ళతో త్రాగుతున్న లీల ఈ లోకాన్నే మరిచిపోయింది.

"మీరు నిద్దరపోలేదా ?"

ఉలిక్కిపడింది లీల! నవ్వుతూ దగ్గరకి వచ్చి నుంచున్నాడు మురళి. సమాధానం ఏం చెప్పలేక లీల తబ్బిబ్బు పడింది. "నిద్దరపట్టకపోతే నన్ను లేపకపోయారా ?" అన్నాడతను. లీల జవాబు చెప్పలేదు. "చల్లగా ప్రశాంతంగా వున్న సమయంలో నిద్దరపట్టకపోవడమేమిటి ?" అన్నాడు.

లీల కోపంగా "మరి మీకెందుకు నిద్రపట్ట లేదూ ?" అంటూ అడిగింది. ఈమాటు తబ్బిబ్బు పడడం మురళి వంతు అయింది. "నాకా ... నాకు..." అంటూ అతను తొట్రుపడుతూంటే లీల పకపకా నవ్వేసింది. నిస్సహాయంగా మురళి కూడా నవ్వాడు.

"భలేవారే ! రండి లోపలికిపోయి కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం" అంటూ తన గదిలోకి దారి తీసింది లీల. తటపటాయించి మురళి కూడా లోపలికి వెళ్ళాడు. రూమ్‌లో బెడ్‌లైటు వెలుగు తోంది. ట్యూబ్‌లైటు వెయ్యబోయాడు మురళి. "వెయ్యకండి...ఈ చిన్నలైటే బాగుంది" అంటూ అతణ్ణి వారించింది లీల. 'సరే' అంటూ పక్కనున్న పడక కుర్చీ లాక్కుని కూర్చున్నాడు మురళి. లీల తన మంచంమీద మోకాళ్ళచుట్టూ చేతులు కట్టుకుని మోకాలిమీద గెడ్డం ఆన్చి కూచుంది. చాలాసేపటిదాకా ఎవరూ మాట్లాడలేదు.

"ప్రభాకరం ఇంట్లో మిమ్మల్ని చూసినప్పటి నుంచీ మిమ్మల్నో విషయం అడగాలనుకుంటు న్నాను" అనుమానిస్తూ అనుమానిస్తూ అన్నాడు మురళి.

ఆ మసక వెలుతురులో మిల మిల మెరుస్తున్న కళ్ళు అతనికేసి తిప్పి, చిలిపిగా కను రెప్పలు టపటపలాడిస్తూ చూసి "అడగండీ ! అందుకు అంత సందేహమెందుకు?" అంది లీల నవ్వుతూ.

"అహ ! ... ఢిల్లీలాంటి మహాపట్నంలో వుంటూ, డిగ్రీ చదువు చదువుతూ, ఎంతమందో గొప్పవాళ్లని నిత్యమూ చూస్తున్న మీకు, ఈ పల్లెటూరి ఆర్టిస్టంటే అంత అభిమానం ఎందుకండీ !"

లీల పకపకా నవ్వి "గొప్ప అనుమానమే వచ్చిందే మీకు ! ఎంత గొప్ప మనిషినైనా చూడొచ్చు. మన ఊహలూ భావాలూ ఏకీభవిస్తేనే కాని ఆ వ్యక్తిమీద గౌరవం, అభిమానం యెలా కలుగుతాయి ? మీ ఆర్టూ, మీ భావాలూ నాకు నచ్చాయి. అందుకే నాకు యిష్టం" అంది. మురళి ఏం మాట్లాడలేదు. విద్యా, సంస్కారం, సంపదా, సౌందర్యం అన్నీ వున్న ఈ అమ్మాయి కేవిటి తనూ, తన ఆర్టూ నచ్చడం ఏవిటి అని ఆశ్చర్యపోయాడు.

"పోనీ అది అలా వదిలెయ్యండి ... మీ నాన్న గారు ఢిల్లీలో వున్నారు అన్నారుకదా ! ఆయ నొక్కర్నీ వదిలేసి మీరిలా, టూర్లు రాకపోతే, ఆయనతోకూడా కలిసి బయలుదేరకపోయారూ ! లేకపోతే ఆయనతో అక్కడే వుండిపోకపోయారా ? వున్న యిద్దర్లోనూ, ఒకళ్ళ ఢిల్లీలోనూ మరొకరు టూర్లలోనూ ఏవిటండీ !"

లీల చాలాసేపటివరకూ మాట్లాడలేదు. తర్వాత బరువుగా నిట్టూర్చి "యిలా ప్రదేశాలు చూడ్డానికని బయలుదేరితే, కొన్ని బాధలు మరచి పోవచ్చుగా" అంది.

"బాధలా ? ... మీకు బాధలా ? ... మిమ్మల్ని చూస్తే అసలు విచారం అనేది జీవితంలో ఎరగని వాళ్ళలా వుంటారు."

"నిజమే ! మనస్సుని నిత్యమూ పిండేసే ఆవేదనని కప్పిపుచ్చుకోడానికి నవ్వు మంచి సాధనం కదా అని..."

మురళి ఆశ్చర్యంగా వినసాగాడు.

"మళ్ళీ మా దొడ్డమ్మ దగ్గరా, ప్రభాకరం దగ్గరా అనకండి. వాళ్ళకికూడా తెలియదు. మా అమ్మ మామూలుగానే చచ్చిపోయింది అనుకుంటు న్నారు. నిజానికి మా అమ్మ చావలేదు. హత్య చేయబడింది ... మా నాన్నచేత."

పిడుగు పడ్డట్లు ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచి నుంచున్నాడు మురళి.

"మాది బాగా వున్న కుటుంబం. మా తాతయ్యే రెండు మూడు పెద్ద మేడలూ, నాలుగైదు లక్షల రూపాయలూ యిచ్చిపోయాడు. దానికి తోడు మా నాన్నగారు కూడా పెద్ద ఉద్యోగంచేసి చాలా సంపాదించారు. మా డాడీ మామూలుగా యెంతో మంచివారు. అయితే ఆయనకు ముక్కు మీద కోపం వుండేది. అదికూడా చాలా భయంకర మైన కోపం. అది వచ్చినప్పుడు ఆయనకి వళ్ళు తెలియదు. చేతిలో ఏం వుంటే అది విసిరేవారు. ఆయన కోపానికి తాళలేక మా యింట్లో నెలకో నౌకరూ, దాసీది, వంటవాడూ మానేసేవారు..."

మురళి ఊపిరి బిగబట్టి వింటున్నాడు.

"వాళ్ళంటె వెళ్లిపోయేవారు. మా అమ్మ ఎక్కడికి వెళుతుంది ? ... కోపంలో ఎంత హింసించినా, మామూలుగా వున్నప్పుడు ఎంతో ప్రేమగా చూసేవారు కనక, ఎలాగో ఓర్చుకొనేది. క్లబ్బుకీ, పేకాటకీ, గుర్రపు పందేలకీ, ఇలా ఆయన వేలకి వేలు ఖర్చు చేసేస్తుంటే, ఆ వ్యసనాలన్నీ మానెయ్యాలంటూ ఓ రోజున మా అమ్మ పెద్ద పేచీ పెట్టింది. ఆ రోజున యింట్లో చాలా గొడవయింది. మా నాన్నగారికి పిచ్చికోపం వచ్చి, ఆ కోపంలో పక్కనే వున్న పచ్చడిబండ మా అమ్మ మీదకి విసిరేశారు. అది వచ్చి అమ్మ కణతకి తగలడం, వెంటనే ఆమె ప్రాణం వదిలెయ్యడం జరిగాయి. జరిగిన ఘోరం అర్థం అయి ఆయన తల బాదుకొని, ఈ నా పాపిష్టి చేతుల్ని నరికేసు కుంటాను అంటూ ఏడ్చారు.

మా అమ్మని చేతులారా చంపేశారన్న ఆవేశంతో నేను కోర్టులో డాడీకి వ్యతిరేకంగా సాక్ష్యం చెబితే ఆయనకి ఏ శిక్షపడేదో ! కాని పోలీసులకి అలా వాఙ్మూలం యిచ్చినా, తర్వాత స్థిమితంగా ఆలోచించి, కావలసినవాళ్ళు యిచ్చిన సలహాను పాటించి, పోయిన అమ్మ ఎలాగూ పోయింది, వున్న డాడీ అయినా మిగుల్తారు అని, "మా అమ్మ కాలుజారి రుబ్బుబోలు మీద పడి కణతపగిలి చని పోయింద"ని కోర్టులో చెప్పాను. తర్వాత అలా

*జరిగిన కథ 5 :* భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్యగారి ఆస్తంతా దాన ధర్మాలతో హరించిపోయింది. అంకరాజు మిల్లులో గోడౌన్ కీపరుగా చేరతాడు మురళి. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు. ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు. ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి. ఉషని మద్రాసులోని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం. దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల. మురళితో కలసి విహార యాత్రలకి బయల్దేరుతుంది లీల. అంకరాజు తిరిగి కనిపించటంతో ఆందోళన చెందుతుంది ఉష.

పిచ్చికోపం రావడం ఒకరకమైన నరాల బలహీనత అనీ, అది మెదడుకి కూడా సంబంధించిన జబ్బు అనీ తెలిసి, విదేశాలకి వెళ్లి యిప్పుడా జబ్బు నయం చేసుకు వచ్చారనుకోండి ... ఇప్పుడాయన బాగానే వున్నారు, ఆయనకా కోపమూ పూర్తిగా తగ్గిపోయింది. కాని అమ్మేదీ? యిప్పుడు రమ్మంటే వస్తుందా? నాకేవిటో డాడితో కలిసి ఆ ఇంట్లో వుండాలీ అంటే ఓ రకమైన విరక్తీ అసహ్యమూ ఏర్పడి తరుచు యిలా ఢిల్లీ వదిలి ప్రదేశాలు చూడడం వంకని వచ్చేస్తూ వుంటాను. ఆయనా అర్థంచేసుకుని వూరుకుంటారు. యింటికి వెళితే అమ్మ లేని ఆ యిల్లు అమ్మకోసం వాలాగే ఏడుస్తూ వున్నట్లనిపిస్తుంది."

లీల కంఠం బొంగురుపోయి ఆ తర్వాత మాట్లాడకుండా వూరుకుంది. కాస్సేపటికి ఆమె ఎక్కి ఎక్కి ఏడుస్తున్నట్లయి మురళి ఆదుర్దాగా లేచి ట్యూబ్‌లైటు వేశాడు. ఆమె కళ్ళమ్మట ఏకధారగా నీళ్ళు కారుతున్నాయి. మురళి కంగారుపడి దగ్గరగా వెళ్లి "మనస్సు బాధపెట్టుకోకండి. అయిందేదో అయిపోయింది." అన్నాడు.

లీల ఏడుపు మానలేదు. ఏం చెయ్యడానికీ తోచక కాస్సేపు తటపటాయించి, హేంగర్‌ని వున్న నేప్‌కిన్ తీసి ఆమె కన్నీళ్ళు తుడవబోయాడు. లీల ఆతని చేతికి తన చెక్కిళ్ళూ ముఖమూ ఆన్చి, గట్టిగా చెయ్యి నొక్కుతూ బిగ్గరగా ఏడ్చేసింది.

# గాజు మేడ

జీవితంలో మొదటిసారిగా స్త్రీ శరీరం తగలడంతో, వళ్ళంతా కోటి విద్యుత్తులు ప్రవహించినట్లయి వేడెక్కి, సెగలూ, పొగలూ కక్కింది మురళికి. ఆతని చేతిని అలా తన చెక్కిలికి ఆన్చుకొన్నాక, ఆమె హృదయంలో లేచిన మంట కొంత చల్లారినట్టయి, శరీరం అంతా ఒక్కమారు గగుర్పొడిచి ఆ తర్వాత వళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. ఒకరి స్పర్శ సుఖం మరొకర్ని మత్తుగా మైమరపిస్తుంటే అలా చాలాసేపు వుండిపోయారు యిద్దరూ. తర్వాత నెమ్మదిగా తేరుకుని, యిలా అయిందేవిటి అని కంగారుపడుతూ మురళి తన గదిలోకి వెళ్ళిపోయాడు. మర్నాటి వుదయం ఒకరి ముఖం ఒకరు చూసుకోవడానికి సిగ్గుపడ్డారు.

హంపీ చేరుకొనేదాకా లీలా మురళీ స్థిమితపడి జరిగిందంతా మరిచిపోయి, యధాప్రకారం సహజంగా ఒకరి ముఖంలోకి యింకొకరు చూస్తూ మాట్లాడుకోలేకపోయారు.

హాస్పేట నుంచి జీపులో కమలాపురం వెళ్ళి, ఆక్కడ గవర్నమెంటు ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు వారి గెస్ట్ హౌస్‌లో దిగాక, "నాకోసం మీరింత డబ్బు ఖర్చుపెట్టడం నాకు మొహమాటంగా వుంది సుమాండీ!" అన్నాడు మురళి.

"ఇది నా డబ్బు అనుకోవడంవల్ల మీకు అలా



వుంది. కాదు ఇది మీ డబ్బే. నాగురించి ఖర్చుపెడుతున్నాం అనుకోండి. అదేం వుండదు...అందువల్ల ఈ పర్సు మీదగ్గర వుంచండి" అంటూ, మురళి "ఇదేమిటి? వద్దు...వద్దు..." అంటున్నా వినిపించుకోకుండా అతని జేబులో పర్సు కుక్కింది లీల. తర్వాత గాలిలో చూపుడువేలు ఆడిస్తూ "ఇదిగో చూడండి ... నేను ఇంచుమించు మీ వయస్సు దాన్ని. మన యిద్దరం మీరు మీరు అనుకోవడం ఏం బాగోలేదు. ఇప్పటినుంచి లీలా అని పిలవండి...నేనూ మురళీ అని పిలుస్తాను. అలాగే అని తలఊపుతే కాదు. అలా పిలవాలి. మళ్ళీ మీరు అన్నారో చూస్కోండి" అంటూ బెదిరించింది.

మురళి నవ్వుతూ "అంటే ఏం చేస్తారు? ... పొరబాటు ... ఏం చేస్తావు?" అన్నాడు.

"ఏం చేస్తానా?... ఇదిగో నా పైటచెంగు చాలా పొడుగు...దీంతో నీ రెండుచేతులూ బంధించి నా వెనకాల తిరగమంటాను" అంది చిరుకోపం నటిస్తూ.

మురళి పకపకా నవ్వాడు.

ఆ నవ్వులో లీలనవ్వు కలిసిపోయింది.

"భగవంతుడు ఎంతచక్కని బొమ్మని సృష్టించాడు!" అనుకొన్నాడు మురళి, అందాలు ఒలకబోస్తూ ఎదురుగుండా వయ్యారంగా నుంచున్న లీలనిచూసి. ఇద్దరూ ఒక గైడ్‌ని వెంటబెట్టుకొని అక్కడికి నాలుగైదు ఫర్లాంగులలో ఉన్న హంపీ శిధిలాలు చూడ్డానికి బయలుదేరారు.

కృష్ణదేవరాయల విగ్రహంచూసి "ఎంత రీవీగా ఉన్నాడీయన...తురాయి పెట్టుకుంటే నువ్వూ ఇలాగే ఉంటావు" అంది లీల. రాణుల స్నానాల స్థలం చూసి, రాయల సింహాసనం ఉండే మండపం, భూగర్భంలోఉన్న ఆలోచనా మందిరంలోకి ప్రవేశిస్తున్నప్పుడు 'నాకు భయంగా ఉంది' అంటూ లీల గట్టిగా మురళిచెయ్యి పట్టుకుంది. హజారా రామస్వామి దేవాలయాన్నీ, రాతిరథాన్నీ, సరిగమల స్థంభాల్నీ చూసినప్పుడు మురళికి ఓ పక్కనుంచి కన్నీళ్ళూ మరోపక్కనుంచి ఆనందబాష్పాలూ జలజలా రాలాయి. ఏనుగుల మహల్ చీకటిగా గంభీరంగానూ, నరసింహ విగ్రహం ఎత్తుగా భయంకరంగానూ కనిపించాయి లీలకి. పద్మాలయాన్ని చూసి అందులోచెక్కిన ప్రతి పద్మాన్నీ చూస్తూ చాలాసేపు అక్కడే ఉండిపోయాడు మురళి. పెద్ద పెద్ద బండరాళ్ళ మధ్యనుంచి దోబూచులాడుతూ ప్రవహిస్తున్న తుంగభద్రనిచూసి "గంగాస్నానం, తుంగాపానం" అంటూ రెండుదోసిళ్ళ నీళ్ళు ఆప్యాయంగా తాగాడు మురళి.

"ఈ నదిలో స్నానం చెయ్యాలి" .అంది లీల.

"ఇక్కడ మొసళ్ళు ఉంటాయమ్మా" అన్నాడు గైడ్.

"ఆ బట్టలతో స్నానంచేస్తే ఇక్కడ పొడి బట్టలేవీ? ... ముందు చెప్తే గెస్ట్‌హవుస్ నుంచి వచ్చేటప్పుడు ఓ జత వేసుకుని వద్దుం కదా?" అన్నాడు మురళి.

"ఫరవాలేదు ... గెస్ట్‌హవుస్‌కి వెళ్ళేటప్పటికి ఈ బట్టలు ఆరిపోతాయి"




1973 పత్రిక దీపావళి కథలలో ఒకటైన 'విప్లవం' రచయిత "శిరిప్రసాద్" యీ మధ్యనే బి.కాం. గ్రాడ్యుయేట్ అయినాడు. పేరు 'శిరిప్రసాద్' అనే చెప్పాడు. కాని సిరిపురపు హనుమత్ ప్రసాద్ అని అనుకుంటాను పూర్తి పేరు. కొంచెం పీలగా వున్నా, యీ కుర్రవాడి కళ్ళు లోతుగా చూస్తూ దేన్నో అన్వేషిస్తున్నట్లుంటాయి. రచయితల కుండాల్సిన కొన్ని లక్షణాలు "గాసిప్" "డివిక్షన్స్" యీరెండూ వక్కపొడి నములుతూ చాలాసేపు చేస్తూవుండే సిరిప్రసాద్ చదువులో కూడా ఫస్టుక్లాసు మార్కులు తెచ్చుకున్నాడు. పై చదువులకు వెళ్ళాలన్న ప్రయత్నం చేస్తున్నాడు. తాపీగా మెత్తగా మాట్లాడుతాడు కాని ఆ వెనక కొన్ని స్థిరమైన అభిప్రాయాలు, కొంచెం 'లైఫ్‌లో ఎర్లీ' గానే ఏర్పరుచుకున్నట్లు అగుపడతాడు. చిన్నప్పట్నించి యీ రచనా వ్యాసంగం నాటకాలు లాంటి వ్యాపకాలు గల యీ యువకుడు హైస్కూల్లో చదూకుంటూ, ఒక స్వతంత్ర దినోత్సవంనాడు వర్షం కురుస్తూంటే 'ఉత్తమ వ్యాసం రాసిన బాలుని'గా ఒక రచయిత



చేతో మెళ్ళో దండేయించుకొని, బహుమానం అందుకున్నాడు. అది మరుపురాని సంఘటన నాకు అన్నాడు. తన దీపావళి కథ [1973 ఆం. స. వా. ప. "విప్లవం"] వల్ల రచయితగా ఎంతో మంది మెప్పు పొందిన సిరిప్రసాద్ 'రచన'ను సాధనగా ఒక తపస్సుగా, "గణం కంటే గుణం" ముఖ్యమైన రచనల కోసం చేసేవాడిగా ఎదుగుతాను అని హామీ యిచ్చాడు... అతని లైకింగ్స్ చలం, గోపీచంద్ లైతే అతనికి నచ్చిన పాత్ర శరత్‌బాబు శేష ప్రశ్న లోని 'కమలం' — వైవిధ్యం కోసం యీ కుర్రవాడు తంటాలు పడుతున్నా డనటానికి మరో నిదర్శనం విజయవాడ కాలేజీ (ప్రభుత్వంవారి) డ్రమటిక్ అసోసియేషన్‌లో రాణించి దానికి పోయినేడాది కార్యదర్శి అయినాడన్నది చెప్పుకోవచ్చును. నటన, పాటలు కూనిరాగాలు గిటారు తీయటం, లలిత కళల పోటీలు లాంటి వాటిమీద యింట్రెస్టున్న సిరిప్రసాద్ కొంతమంది వర్ధమాన యువ రచయితలు మిత్రులు కలసి పెట్టుకున్న సరసం అనే సంఘానికి అధ్యక్షుడైనాడు యిప్పుడు. "రాజకీయాల పరిజ్ఞానం చాలు" ప్రవేశం వద్దు అన్నాడు. బెటర్ కీప్ ఇట్ అవే! పోతే తనకో ఏంబిషన్ వుందన్నాడు. అతని మాటల్లోనే చెపుతాను. "ఎన్నో కారణాలవల్ల చాలా మంది యువకులు పిల్లలు మెంటల్ డిప్రెషన్‌కు గురవుతూంటారు. అది వారి శక్తియుక్తుల్ని పీల్చేస్తుంది. అటువంటి ఫ్రెండ్స్ కోసం నా "లైఫ్"లో ఏదో ఓ రోజు "స్కూల్ ఆఫ్ హోప్" ప్రారంభించాలనే ఐడియా, ఎప్పటికైనా "యీ విషయంలో సక్సెస్ కాగలననే హోప్" అతనికి వున్నాయి — విద్యార్థులు యువకులు తమలో తాము మాట్లాడుకునేటప్పుడు బూత పదాలు, కొన్ని బూతు మాటలు వాడతా రెందుకన్న ప్రశ్నకి "చిన్నప్పటి వాతావరణం, పరిసరాల కాలుష్యం అందుకు కారణాలేమోనన్న శిరిప్రసాద్‌తో పాటు చాలామంది యువజనులు 'ఔనూ! విద్యావంతులయ్యాక కూడా మనం ఎందుకు యీ అశ్లీల పదాలతో పరస్పరం పిల్చుకుంటూ మాట్లాడుకుంటూ వుంటాం" అన్న దాలోచిస్తే [illegible]దూ?

— [ పీ లం జీ ]

---

"తడిచీరతో వస్తావా?" నెమ్మదిగా అన్నాడు మురళి.

"ఏం?...ఇక్కడ ఎవరు చూస్తారు?... ఓ... ఈ గైడ్ ఉన్నాడనా?... ఇతణ్ణి పంపించివేద్దాం... అన్నీ చూడ్డం అయిపోయిందిగా?... మనం వెనక్కి వెళ్ళలేమా ఏమిటి?" అంటూ లీల గైడ్‌ని పంపించివేసింది.

"గైడ్‌నిఅయితే పంపించివేసింది. మరి తను? తనఎదురుగా తడిచీరతో వస్తుందేవిటి?" మురళి గట్టుమీద కూర్చుని ఆలోచిస్తున్నాడు ...

"నీళ్ళు ఎంత చల్లగా హాయిగా ఉన్నాయో నువ్వుకూడా స్నానం చెయ్యి" అంది లీల. కాని మురళి గట్టుదిగలేదు. నల్లని రాళ్ళచుట్టూ తెల్లగానూ ఒక్కొక్కచోట నీలంగానూ ప్రవహిస్తున్న తుంగభద్రానది ... నీలవు మణులమధ్య పచ్చగా బంగారంలో మెరిసిపోతూన్న లీల ... ఆ వింతరంగుల సమ్మేళనాన్ని చూస్తూ ఉండిపోయాడు, మురళి. ఇంతలో 'హమ్మో' అంటూ పెద్ద అరుపు అరిచి ఒక్కమాటు నీళ్ళల్లోంచి గట్టుమీదికి వచ్చి పడి, ఆ తడిబట్టలతోటే మురళిని అమాంతం కౌగలించుకుంది లీల. భయంతో వణికిపోతూన్న ఆమెని సందిట్లో పొదువుకొని "ఏమైంది?" అన్నాడు మురళి.

అటు చూడకుండా కళ్ళుమూసుకుని, వేలితో మాత్రం అటు నీళ్ళలోకి చూపిస్తూ 'అదిగో' అంది లీల.

"ఏమిటి?" అన్నాడు మురళి నీళ్ళల్లోకి పరిశీలనగా చూసి.

"[illegible]!"

మురళి మళ్ళీ అటుచూసి నవ్వి "అది మొసలి కాదు. నువ్వు మొసలివి ... పైన కదులుతూన్న మేఘంయొక్క నీడ వచ్చి, నీళ్ళల్లో ఉన్న పొడుగైన ఆ నల్లరాయిమీద పడితే ఆరాయి కదులుతున్నట్లనిపించి, అదేదో మొసలి అనుకున్నావు నువ్వు. చూడు సరిగ్గా" అన్నాడు.

లీల భయంగా అటు చూసింది. నిజమే!

నవ్వొచ్చింది తన అకారణ భయానికి. కాని ఆ భయంకూడా ఒక మేలే చేసింది. లేకపోతే మురళిని అలా కౌగలించుకోడానికి వీలుపడేదా? పాపం తను కౌగలించుకోవడంవల్ల అతని పొడి బట్టలు ఎలా తడిసిపోయాయో!

తిరిగి వచ్చేటప్పుడు "తడిసినచీరలో ఆడపిల్ల వస్తూన్నప్పుడు అలా చూడ్డం మర్యాదేనా?" అంటూ కోపం నటిస్తూ అడిగింది లీల.

"ఇది మరీ బాగుంది...నన్ను కళ్ళు మూసుకో మంటావా?" అమాయకత్వాన్ని నటిస్తూ అడిగాడు మురళి.

"యస్...అలా చెయ్యి"

"కళ్ళుమూసుకుని నడిస్తే పడిపోనూ..."

"ఫరవాలేదు ... చెయ్యి పట్టుకుని నేను నడిపిస్తానులే"

"నిన్నునమ్మి చెయ్యి అందించనా?"

"లేకపోతే అటు మొహంపెట్టి ఇటు నడు" వచ్చేనవ్వుని ఆపుకుంటూ అంది లీల. "వాళ్ళే పడ్డానికి ... అంతకంటే నీచెయ్యి పట్టుకోవడమే మంచిది" — మురళి చేతిని లీల అందుకున్నప్పుడు ఇద్దరి నరాలూ ఒక్కసారి జివ్వుమన్నాయి. ఇద్దరి గుండెలూ ఒకే లయతో వేగంగా కొట్టుకోసాగాయి. హంపీనుంచి ఇంటికి తిరుగుముఖం పట్టేదాకా ఒకరితోఒకరు మళ్ళీ మాట్లాడుకోలేదు.

## 9

ఆ రోజు ప్రభాకరం పుట్టినరోజు!

"అమ్మకి అంతా చాదస్తం" అనుకుంటూ తలంటుకొని కొత్తబట్టలు వేసుకుని, దేవుడి ఫోటోకి దణ్ణంపెట్టాడు ప్రభాకరం. తెల్లారేటప్పటికి వేణుమాధవస్వామికి భోగం చేయించి ప్రసాదాలు ఇంటికి తెప్పించింది జోగమ్మ. "ముందీ ప్రసాదాలు తీసుకుని మరీ కాఫీ తీసుకో" అంటూ పులిహోరా, దధ్యోదనం, చక్రపొంగలీ మూడూ మూడు ప్లేట్లలోనూ పెట్టి టేబిల్‌మీద వుంచింది.

"పొద్దుటే ఈ త్రిమూర్తుల్ని పుచ్చుకుంటే ఇంకివాళ్టికి భోజనం చేసినట్టే" అంటూ ముందు తనకిష్టం అయిన చక్రపొంగలి ప్లేటు దగ్గరికి లాక్కున్నాడు ప్రభాకరం. పక్కనే స్టూలుమీద కూచుని మరచెంబులో నీళ్ళు గ్లాసులో పోస్తూ "ముప్ఫయ్యేళ్ళు పూర్తి అవుతాయి యివ్వాల్టోటే. ఇంకా యిప్పటికేం పెళ్లి మాట ఎత్తవు. ఇంకెప్పుడురా నువ్వు పెళ్లి చేసుకొనేది? ముసిలాడివి అయ్యాకా? అసలు నేను బతికుండగా చేసుకుంటావా అని" అంది జోగమ్మ.

"ఎందుకమ్మా అలా తొందరపడతావు? నేనుమాత్రం ఆలోచించడం లేదంటావా? నీకు అనుకూలంగా వుంటూ నాకు నచ్చేలా వుండాలి ఆ వచ్చేపిల్ల. చదువుకున్నదైతే ఒక చిక్కు. చదువు రానిదైతే మరో చిక్కు. పట్నవాసంది అయితే ఓ యిబ్బంది, శుద్ధ పల్లెటూరిదైతే మరో యిబ్బందిమ."

"ఊ... చెప్పు... అందమైంది అయితే ఒక

నష్టం. అనాకారిది అయితే ఇంకో నష్టం... అలాగే తెలివైంది అయితే ఒక బాధ, తెలివి తక్కువది అయితే మరో బాధను... ఊరుకోరా... ఎవరేనా నవ్విపోతారు... ఇంతకంటే నేనసలు పెళ్లి చేసుకోను... ఇలా బ్రహ్మచారిగానే ఉండిపోతాను అని ఒక్క ముక్క చెప్పకూడదూ ?"

"లేదమ్మా... చూస్తావుగా... నేను త్వరలోనే పెళ్లి చేసుకుంటాను... పిల్ల ఎలా ఉంటుందనుకున్నావు ?... మాంచి అందంగా, పల్లెటూరి అమాయకత్వంతో, పట్నవాసం గడుసుదనంతో, కాస్త చదువుకుని, నాకు నచ్చేలా, నువ్వు మెచ్చేలా..."

"నిజంగానేరా ? అలాంటి అమ్మాయి ఉందా? మరి నాకు ఇన్నాళ్ళనుంచీ చెప్పావుకాదేం ? ఎవరా అమ్మాయి ? నేను ఎరుగుదునా ? మనకి తెలిసిన పిల్లేనా, కొత్తదా..."

"పిచ్చి అమ్మా... నీకేం తెలియదు" అంటూ తల్లిని కౌగలించుకొని కాఫీ తీసుకుని హాస్పటల్‌లోకి వెళ్లిపోయాడు ప్రభాకరం. కొడుకు వెళ్లిన దిక్కే చూస్తూ "వెర్రి నాయన! తన సుఖం తనకి తెలియదు... తనకి వేడీ వెచ్చనా చూసే మనిషి ఉండాలని మనం పోరి చెప్పాలి... తండ్రిలాగే వట్టి అమాయకత్వం... ఆ మహారాజు కూడా అచ్చు ఇలాగే ఉండేవారు... హుఁ!... ఏవిటో" అనుకుంటూంటే జోగమ్మ కళ్ళు రెండూ నీళ్ళతో నిండిపోయాయి.

"ఈ బ్రెడ్లూ, బిస్కెట్లూ, పాలూ, పళ్ళూ ఏవిటి ? ఇన్ని ఎవరు పెట్టారు ఇక్కడ ?" అన్నాడు ప్రభాకరం రెండు మూడు టేబిల్స్ మీద నిండుగా ఉన్న సరంజామా చూసి.

'పెద్దమ్మగారు పెట్టించారు. ఇవాళ మీ పుట్టిన రోజటగా ? ఇవన్నీ మీ చేత్తో పేషెంట్లకందరికీ పంచాలట" అన్నాడు సీతాలు.

"ఊ... ఇలా ఏర్పాటు చేసిందా ?... సరే!"

## గా జు వే డ

అవి, మొదట తన గదిలో ఎదురుగుండా ఉన్న తండ్రి నిలువెత్తు ఫొటోకి మనస్సా నమస్కారం చేసి, "సీతాలూ అవి అన్నీ ట్రాలీమీద పెట్టి వార్డులలోకి తీసుకురా" అన్నాడు ప్రభాకరం.

ఓ పక్కనుంచి సీతాలూ, మరో పక్కనుంచి నర్సు మరకతం బ్రెడ్లూ పళ్ళూ అందిస్తూంటే, ప్రభాకరం ఒక్కొక్క పేషెంటునే ఆప్యాయంగా పలకరిస్తూ వాళ్ళకి అవి పంచిపెడుతున్నాడు.

తలంటి నీళ్ళు పోసుకున్న జుట్టు ఒత్తుగా పట్టుకుచ్చులా గాలికి ఇటూ అటూ కదులుతూ ఉంటే, వేసుకొన్న లేత నీలం రంగు కొత్తసూటులో పచ్చగా బలంగా ఉన్న శరీరం హుందాగా కదులుతూ ఉంటే, గంభీరంగా ఉన్న ముఖాన్ని పెదమల మీద కనిపించీ కనిపించని చిరునవ్వు కాంతిమంతంగా వెలిగిస్తూంటే, నిండుగా ఉన్న మగతనం, ప్రతి, కదలికలోనూ ఉట్టిపడుతూంటే – అబ్బ!... ఈయన ఎంత అందమైనవారు!... అనుకుంటూ దూరంగా వార్డు మొదట్లో నిలబడి ప్రభాకరాన్ని కళ్ళకి నిండుగా చూస్తోంది డాక్టరు జానీ.

బ్రెడ్లూ, పళ్లూ అందిస్తూ కావాలనే ఒకటి రెండుసార్లు ప్రభాకరం వేళ్ళకి తన వేళ్ళు తగిలించింది మరకతం. మొదట ప్రభాకరం అదేం పట్టించుకోకుండా చూసీ చూడనట్లు వూరుకున్నాడు. పక్కనేవున్న సీతాలు మాత్రం కనిపెట్టాడు. ఓ వరసలో వున్న పేషెంట్లకి యిచ్చి రెండోవరస వైపు తిరుగుతున్నప్పుడు మరకతం బుజం ప్రభాకరానికి తగిలింది.

ప్రభాకరం కోరగా చూశాడు.

మరకతం నాలిక కరుచుకుని నేలకేసి చూస్తూ వుండిపోయింది. ప్రభాకరం అటు చూస్తున్నప్పుడు అతనికేసి, తమకంతో తనని తాను మరిచి మరకతం చూస్తూవుండాన్ని సీతాలూ, ప్రభాకరమేకాదు, దూరాన నిలబడివున్న జానీకూడా గమనించింది. ఆరోజు మరకతం మనస్సు ఆమె వశం తప్పింది. అందుకే మామూలుగా వుండే పద్ధతికి ఒకపాలు మించి, మరికొంచెం చనువుగా, యింకొంచం వయ్యారంగా ప్రభాకరంపట్ల ప్రవర్తించసాగింది.

ప్రభాకరం అంతా పరిశీలిస్తూనే వున్నాడు. ఆసలీమధ్య చాలారోజుల నుంచే మరకతంలో మార్పు వచ్చింది. తను ఏకాంతంగా వున్నప్పుడు అవసరం లేకపోయినా ఏదో పని కల్పించుకొని రావడం, వచ్చినప్పుడల్లా అనవసరమైన సిగ్గు కన్పరచడం, ఓరగా చూడ్డం, గారంగా మాట్లాడ్డం, ఏవేవో పిచ్చి పనులు చేస్తోంది. ఇవాళ మరీ శ్రుతిమించింది. మరకతం యిలా తనతో అర్థంలేని చనువుని పెంచుకోవడం హాస్పటల్‌లో అంతా కాకపోయినా సీతాలూ, డాక్టర్ జానీ యిద్దరూ కనిపెట్టేసట్లున్నారు. ఇది పదిమందికీ తెలిస్తే తన పరిస్థితి యెంత లోకువ అవుతుంది! ఆ ప్రమాదం ఏదో జరక్కుండా ఈ లోగానే ఈ మరకతం వ్యాధికి సరియైన వైద్యం చెయ్యాలి. అయితే అందుకు ఏదో ఒక సందర్భం కలిసిరావాలి. మరీ ఈ ప్రవర్తన కారణంగా ఏమైనా చేస్తే అంత బాగుండదు.

ప్రభాకరం అనుకున్నట్లే ఆ తర్వాత ఓ అరగంటకి ఒక సంఘటన జరిగింది. వార్డుల్లో వున్న ఇన్ పేషంట్లకీ పళ్లూ అవీ పంచి, తన రూమ్‌లోకి వచ్చాడు ప్రభాకరం. అందర్నీ పరీక్షచేసి రౌండ్సు అయ్యాక జానీ కూడా ఆమె రూమ్‌కి వచ్చింది. తన గదిలో ప్రభాకరం ఔట్ పేషెంట్సుని ఒక్కొక్కళ్ళనే లోపలికి రమ్మని పరీక్ష చేస్తున్నాడు. అలాగే జానీ రూమ్‌లోకి ఆడవాళ్ళు ఒక్కొక్కళ్ళే వెళ్ళి వస్తున్నారు. డాక్టర్ల యిద్దరి గదులకీ మధ్య

హాఫ్ షట్టర్సే వుండడంవల్ల అవసరం అయితే, ఒకళ్ళ గదిలోకి ఇంకొకళ్ళు వెళ్ళి, సలహాలు తీసుకుంటున్నారు. ఈ రూమ్‌లో ప్రభాకరం, ఆ రూమ్‌లో జానీ, వచ్చే పోయే పేషెంట్స్‌తో పొంచి బిజీగా వున్నారు. ఏవో చిన్న చిన్న చప్పుళ్ళు తప్ప హాస్పటల్ అంతా నిశ్శబ్దంగా వుంది.

ఆ సమయంలో రెండో వార్డులోంచి పెద్ద పెద్ద కేకలు వినిపించాయి. మరకతం కాబోలు ఎవరి మీదో అరుస్తోంది. ప్రభాకరం బజర్‌నొక్కి, లోపలికి వచ్చిన సీతాలుతో 'ఆ గొడవ ఏమిటో చూసిరా' అని పంపాడు. వెళ్ళివచ్చిన సీతాలు "రెండో వార్డులో వున్న ముసలి పేషెంటు ఎవరో బెడ్‌మీంచి దిగుతూ పక్కనున్న కూజాని తన్నాడనీ... అది బద్దలయి నీళ్ళూ కూజా ముక్కలూ, పక్క బెడ్ను దాకా చెదిరిపోయాయనీ, దాంతో మరకతం ఆ పేషెంట్ మీద కేకలు వేసి అతనిచేత ఆ ముక్కలన్నీ ఏరిస్తోంద"ని చెప్పాడు. వెంటనే మంచి కారణమే దొరికింది అనుకుంటూ ప్రభాకరం మరకతాన్ని కబురు చేశాడు.

"నువ్వు ఇక్కడ నర్స్‌గాచేరి ఎన్నాళ్ళయింది?"— ఉరుములా గర్జిస్తూన్న ప్రభాకరం కంఠం విని డాక్టర్ జానీ అదిరిపడింది. తన గదికీ ప్రభాకరం గదికీ మధ్య, పొట్టి రెక్కల తలుపులే ఉండడం మూలాన, ప్రతి అక్షరం వినిపిస్తోంది.

"ఏం మాట్లాడవేం ?" — హాస్పటల్‌లో జనం అంతా ఆ కేక విని నిర్ఘాంతపోయారు. "ఏణ్ణార్ధం కావస్తోందండి."

"ఊ... ఇన్నాళ్ళ నుంచి ఈ హాస్పటల్‌లో పని చేస్తూ కూడా ఎలా ప్రవర్తించాలో తెలియదన్న మాట. నీ కేకలూ, అథారిటీ, పద్ధతీ, వ్యవహారం, ఇవేవీ ఇక్కడ కుదరవు ... ఇదిగో... ఈ రోజుకి నీకు రావలసిన జీతం.. తీసుకుని వెళ్లిపో... ఊ..."

"ఎక్స్‌క్యూజ్‌మీ సార్"

"క్షమించే లిమిట్ ఎప్పుడో దాటిపోయావు నువ్వు. నెల్లాళ్ళనుంచి నీ వ్యవహారం ఏం బాగోలేదు. ఇన్నాళ్ళనుంచీ ఎందుకెందుకని ఊరుకుంటూ వచ్చాను ఇంక ఊరుకొనేది లేదు... ఊ... వెళ్ళు..."

నిశ్శబ్దంగా ఏడుస్తూన్న శబ్దం.

"ఆలశ్యం చెయ్యక ఆ డబ్బు తీసుకో. . ఊ... అవతల పేషెంట్స్ చాలామంది వెయిట్ చేస్తున్నారు. యస్. గెటవుట్."

ఆరోజు ప్రభాకరం కోపం చూచిన ప్రతి ఒక్కరూ గజగజా వణికిపోయారు. జానీ మరీను... ఆమె ఎంతో నెర్వస్‌గా ఫీలయింది. ఆ తర్వాత స్టెతొస్కోపు సరిగా పుచ్చుకోలేకపోయింది. థర్మామీటరయితే చేతిలోంచే జారి బద్దలైపోయింది. ఏదో ఒకటి రెండు సందర్భాలలో ప్రభాకరం తన గదిలోకి వచ్చి 'డయాగ్నసెస్' విషయం ప్రశ్నిస్తే కంఠం వణికి సరిగా జవాబు చెప్పలేకపోయింది. ఇలా ఆమె పడుతున్న అవస్థని ఓ గంట గంటన్నర చూశాక ప్రభాకరమే ఆమెని సమీపించి "డాక్టర్! మీరేదో అన్ ఈజీగా వున్నట్లున్నారు ... ఎలాగా రేపటి నుంచి ఓ వారం శలవు కావాలి ... ఊరు వెళ్లి మీ అమ్మగారిని తీసుకురావాలి అన్నారుగా ?" అన్నాడు.

"అవునండీ! యిప్పటికే ఏడెనిమిది నెలలు అయిపోయింది. మొదట్లో ఒక నెల్లాళ్ళేకదా అని మీ యింట్లో వున్నాను. కాని ఇన్నాళ్ళు అయితే..."

"నో...నో...దానికి మీరేం మొహమాటపడనక్కర్లేదు."

"అయినా వెళతానండి, మీరు శలవిస్తే..."

"ఓయస్! దానికేం ? అవసరం అయితే ఇవాళనుంచే తీసుకోండి శలవు. పైగా ఇవాళ మీరేదో అనీజీగా కూడా వున్నారు."

"ఇవాళే వెళ్ళమంటారా ? ... థేంక్స్ సార్" అంది జానీ, "బ్రతుకుజీవుడా ఈ నెర్వస్‌నెస్ తగ్గి, ఈయనంటే భయం, వెరపూ కాస్త పోతేనే కాని, మళ్ళీ రాకూడదు" అనుకుంటూ.

సీతాల్ని పిలిచి జానీ సామాను బండిలో పెట్టించి పట్నందాకా సాయం వెళ్ళి రైలు ఎక్కించి రమ్మని పంపాడు ప్రభాకరం.

పది గంట లయ్యేటప్పటికి హాస్పటల్‌లో బాగా రద్దీ తగ్గి, వుండుండి ఒకళ్ళో యిద్దరో పేషెంట్సు వస్తున్నారు. ప్రభాకరానికి కాస్త విశ్రాంతి చిక్కింది. తన కేరాఫ్‌లో మురళి పేర వచ్చిన కవర్ని యిటూ అటూ తిప్పాడు. అది మద్రాసు నుంచి ఉష రాసిన వుత్తరం. మొదట్లో అక్షరాలు వంకరటింకరగా వుండేవి! ఈ ఏడాదిలో ఉష రైటింగ్ ఎంత బాగుపడింది ... అప్పుడే ఉష ఆంధ్ర మహిళా సభలో చేరి ఏడాది అయిందా ? ఆర్నెల్లకే థర్డ్‌ఫారం పేసయిందట! ఈపాటికి మెట్రిక్‌కి కట్టేవుంటుంది. ఇన్నాళ్ళూ చదువు చెప్పించలేదు కనక కాని, చెప్పిస్తే యీపాటికి బియ్యేయో ఎమ్మేయో పేసయిపోయివుండును. జానీ పేసవలేదూ ఎమ్. బి. బి. యస్ ? ఆమెకి మాత్రం పెద్ద వయస్సు ఏం వుంటుంది. మహా అయితే ఉషకంటే ఓ రెండు మూడేళ్ళు పెద్దేమో, అంతే! అసలు ఉష ఎమ్. బి. బి. యస్సే చద వచ్చు, ఏ పి. యు. సీ. యో, ఇంటర్మీడియటో పేసయితే! ఇంకా వయస్సు మించిపోలేదు. చదువుతానంటే తను డబ్బు పెట్టుబడిపెట్టి చదివిస్తాడు! కాని ఆమె మహా పౌరుషమైన వ్యక్తి. తన డబ్బు ఎక్కడ తీసుకోవలసి వస్తుందో అని కదా, మురళికి మరీ మరీ రాసి మునసబు సర్టిఫికెట్ తెప్పించుకొని, ఫ్రీ స్కాలర్‌షిప్పు సంపాదించింది!

అవును! ఇప్పుడీ వుత్తరం మురళికి ఎక్కడ కని పంపించడం! ఆ లీలా, మురళీ కలిసి ఏ వూళ్ళు తిరుగుతున్నారో! . . మధ్యలో ఏ రెండు మూడు మార్లు వచ్చారో ఏమో! అంతే! ... ఓమాటు శ్రావణ బెల్గోలా అన్నారు...ఇంకోమాటు అజంతా ఎల్లోరా అన్నారు. బాగానే దొరికారు ఒకళ్ళ కొకళ్ళు. అది బాబయ్య దగ్గర్నుంచి వెయ్యి చెల్లగా వెయ్యి తెప్పించడం, ఇతను ఈ ప్రదేశం నుంచి ఆ ప్రదేశం, అక్కడనుంచి యిక్కడికీ, ఇండియా అంతా చూపిస్తూ తీసికెళ్లడం ... పోనీ ఇద్దరూ పెళ్లి చేసేసుకున్నా బాగుండిపోను ... బాబయ్య మరీ పట్టించుకోవడంలేదు. అది అడిగి నప్పుడల్లా ఎంత కావలిస్తే అంత పంపించడమే కాని, ఎక్కడ తిరుగుతున్నావు ? ఏవిటీ పర్యటనలు ? ... చాల్లే ఇంటికి రా అని అనడేవిట ? ఈ మురళి మాత్రం ... అప్పుడేదో ఉద్యోగం సద్యోగం అన్నాడు. ఇప్పుడా లీలతో టూర్లుకొడుతూ వుద్యోగం సంగతే మరిచిపోయాడేవిటి ? ... బాగానే వుంది.

ఇలా ఆలోచిస్తూన్న ప్రభాకరం, "చిన్నయ్య ... అదే డాక్టరుబాబు వున్నాడా ?" అంటూ అవతల ఎవరో వాకబు చేస్తున్న వైనం విని, ఎవరా అని అటు చూశాడు. నెత్తిమీద చెరుకుముక్కల కట్ట పెట్టుకుని, ఓ చేత్తో వుగ్గిలికట్టిన చెరుకుపానకం తప్పేలా, మరో చేత్తో పానకం పెనం అడుగున పేరుకున్న బెల్లంగోకుడు వుండల బుట్టా పట్టుకుని ఓ తెల్లబొద్దు మీసాల ముసలి రైతు సరాసరి అతని గదిలోకి వచ్చేశాడు. అతణ్ణి చూస్తూనే "వీరన్నా నువ్వా? కులాసాగా ఉన్నావా ? ఏవిటి ఇదంతా ?" అన్నాడు ప్రభాకరం నవ్వుతూ, అతను పట్టుకొచ్చిన వస్తువుల్ని చూసి...

"ఇవాండీ! ఏదో పేదోణ్ణి ఇంతకన్నా ఏం తేగలను చెప్పు బాబూ! చేలో పండినాయి. . నా చేత్తో పట్టుకొచ్చి ఇద్దారి, నిన్నూ. అమ్మనీ చూసికూడా నాలుగైదేళ్ళు అయిపోతోందని"

"రైతులు పేదవాళ్ళేమిటయ్యా ఇప్పుడు రాజ్యం అంతా మీదే! పైగా మీకు పొలంమీద ఎన్ని వేలూ లక్షలూ ఆదాయం వచ్చినా ఆదాయపు పన్ను లేదు. ఈ రోజుల్లో కాస్త సుఖంగా బతుకున్నది ఎవరేనా ఉంటే అది ఒక్క రైతులే."

"ఆసికాలకేంగాని, బాబూ అమ్మెక్కడా! మా పెద్దయ్యగారు ఈ నడి మధ్యన ఏదో పెద్ద లోగిలి కట్టారంట! మా సిన్నయ్య అందులో ఉంటున్నాడంట... ఆ యిల్లు చూపించండెహె అంటే ఊళ్ళోవాళ్ళు ఇది చూపించారు... ఇది ఆసుపత్రి కదా, ఇల్లెక్కడ బాబూ!"

"ఇల్లూ ఇదే... అదిగో ఆ దోవని వెళ్ళు... లోపల అమ్మ ఉంది. . మాట్లాడుతూ ఉండు... కాస్సేపట్లో నేనూ వస్తా" అంటూ ప్రభాకరం గది దాటి బయటికి వచ్చి అద్దం తలుపున్న గుమ్మం చూపించాడు వీరన్నకి.

[ఇంకా ఉంది]





"దేవుడులాంటి మనిషి"లో మంజుల, కృష్ణ

### కృష్ణ విజయమ్!

రంజిత్ మూవీస్‌వారి "చీకటి వెలుగులు" వర్ణ చిత్రం ప్రేక్షకుల అమోఘ ఆదరణకు పాత్రమైన నిజాన్ని ఎవరూ కాదనలేరు

నేను ఆ చిత్రాన్ని విజయవాడలో చూశాను. ప్రేక్షకులు హీరో పాత్రధారి కృష్ణను బహుముఖంగా ప్రశంసించారు కృష్ణగారి నటనలో స్పెషల్ థ్రిల్ కనిపించిందని వెల్లడించారు

### రాబోయే కృష్ణ చిత్రాలు

నవచిత్ర ఎంటర్ ప్రైజస్‌వారి "రక్త సంబంధాలు" వర్ణ చిత్రాన్ని నేను చూశాను కృష్ణ నటన 'ఎ' వన్ అని ఘంటాపథంగా చెప్పగలను అన్ని తరగతుల ప్రేక్షకులు కృష్ణ నటనపట్ల ఆనందాన్ని వ్యక్త పరచగలరు

పూర్ణిమా పిక్చర్స్‌వారి "దేవుడు లాంటి మనిషి" చిత్రం కృష్ణ నట జీవితంలో కొత్త అధ్యాయాన్ని సృష్టించగలదు కన్నడ రాజకుమార్‌కు ఏమాత్రం తీసిపోకుండా కృష్ణ నటించారు

"జేబుదొంగలు"లో శోభన్‌బాబు, మంజుల



విజయా ప్రొడక్షన్స్‌వారి "శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్" చిత్రంలో కృష్ణ నవ్వించే నాయకుడుగా బలే హుషారుగా నటించారు. వినోద భరితమైన పాత్ర పోషణలో కృష్ణకు ప్రత్యేకమైన నేర్పు వున్నది గనక, అందరినీ ఆకర్షించగలరన్నది నిర్వివాదాంశం

రవిరాజ్ కంబైన్స్‌వారి "సంతానం—సౌభాగ్యం" చిత్రంలో కృష్ణ సటిల్‌గా నటించి, కథకుడు సృష్టించిన పాత్రకు పూర్తి న్యాయం చేకూర్చారు.

శ్రీ సీతారామాంజనేయ మూవీస్‌వారి "మనస్సాక్షి" చిత్రం కృష్ణ వుత్తమ నటనకు సాక్ష్యం

రాబోయే కృష్ణ చిత్రాలన్నీ, ప్రజామోదాన్ని పొందగల అర్హతను బడసియున్నవని రాయడానికి నేను గర్వ పడుతున్నాను

### నల్లరేగడ కథానాయకుడు

ఆర్. కె. ఆర్ట్స్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న చిత్రంలో కృష్ణ త్యాగధనుడి పాత్రను పోషిస్తున్నారు. మంచిని నమ్మిన వ్యక్తిగా, వంచనను నిర్మూలించే వుత్తముడుగా, అనురాగ బంధానికి ప్రతినిధిగా కృష్ణ నటిస్తున్న ఆర్. కె. ఆర్ట్స్ ప్రొడక్షన్స్ చిత్రం ప్రేక్షక లోకాన్ని మెప్పించగలదు.

### వైవిధ్యం వున్న రెండు పాత్రలు

నిర్మాత డి. బి. నారాయణ రంగుల్లో నిర్మించబోయే సాంఘిక చిత్రంలో వైవిధ్యం వున్న రెండు పాత్రలను కృష్ణ పోషించగలరని, ఆ చిత్రానికి దాసరి దర్శకుడు అని మీకు తెలుసుగా.

### పాడిపంటలు

ప్రేక్షకులు యిష్టపడే చిత్రాలను అందించే సంస్థగా పద్మాలయాకు పేరు వున్నది. ఆ సంస్థ తలపెట్టిన "పాడిపంటలు" వర్ణ చిత్రం షూటింగు సెప్టెంబరు నుంచి ప్రారంభం అవుతుందన్న వార్తను, కృష్ణ చెప్పారు.

"పాడిపంటలు" చిత్రం తాలూకు మూడు పాటలు రికార్డ్ కాబడ్డాయి అని తెలిపారు

ఆంధ్రదేశంలో అనగా మానికొండ, తదితర ప్రాంతాల్లో షూటింగు జరుగగలదని "రైతు"గా నటించే కృష్ణ చెప్పారు. చిత్రంలోని ప్రధాన పాత్రలను విజయనిర్మల, గుమ్మడి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి మరియు జగ్గయ్య పోషించగలరట.

సాంకేతిక శాఖలను మహారథి, మహాదేవన్, స్వామి, కోటగిరి గోపాలరావు నిర్వహిస్తారు

సినిమానువాదం + దర్శకత్వంను సి చంద్రశేఖరరెడ్డి చేపట్టారు. హీరో కృష్ణ సోదరులు ఈ "ప్రెస్టిజ్" చిత్రాన్ని భారీ ఎత్తున నిర్మిస్తారు.

### జానపద హీరోగా కృష్ణ!

ప్రముఖ వ్యాపారవేత్త సుందర్‌లాల్ నహతా నిర్మించబోయే జానపద వర్ణ చిత్రంలో హీరోగా నటించడానికి కృష్ణ సమ్మతించిన సత్యాన్ని, ఆయనే చెప్పారు ఆ చిత్రానికి తాతినేని ప్రకాశరావు గారు దర్శకుడు అని కూడా తెలిపారు

పాత్ర నచ్చితే, జానపద నాయకుడుగా నటించడానికి తనకు అభ్యంతరం లేదని కృష్ణ చెప్పారు.

లోగడ "ఇద్దరు మొనగాళ్ళు, మహాబలుడు" వంటి జానపదాల్లో కృష్ణ హీరోగా నటించారన్న నిజం పాఠకులకు తెలియనిదికాదు.

### పాత చిత్రాలకు బలే వసూళ్లు

హీరో కృష్ణ నటించిన పాత చిత్రాలకు గత రెండు మాసాల్లో బలే వసూళ్లు వచ్చాయి ఆయన నటించిన "తేనె మనసులు, లవ్ యిన్ ఆంధ్రా, టక్కరి దొంగ—చక్కని చుక్క" చిత్రాలు యిటీవల విడుదలై, వింత వసూళ్లను తెచ్చిపెట్టాయి

కృష్ణగారి పట్ల, ఆయన చిత్రాల పట్ల ప్రేక్షకులకు ప్రత్యేకమైన యింటరెస్ట్ వున్నదనడానికి పాత చిత్రాల వసూళ్లు ప్రత్యక్ష నిదర్శనాలు

### ఆగస్టులో దేవుడు చేసిన మనుషులు

పద్మాలయా మూవీస్ నిర్మించిన అద్భుత సాంఘిక వర్ణ చిత్రం "దేవుడు చేసిన మనుషులు" సిల్వర్ జూబ్లీని చవిచూచిననిజం అందరికీ తెలిసినదే

అట్టి ప్రజామోదాన్ని పొందిన "దేవుడు చేసిన మనుషులు" చిత్రం ఆంధ్రప్రదేశ్ లోని అన్ని ముఖ్య కేంద్రాలలో ఆగస్టులో మళ్లీ విడుదలవుతుంది

### హీరో తీసుకున్న నిర్ణయం

తను కావాలి అని వచ్చిన ప్రతి నిర్మాతకు అభయమిచ్చి, ఆశ్రయమిచ్చి చిత్రాల్లో పని చేసిన ఒకే వ్యక్తి ఎవరయ్యా అంటే . హీరో కృష్ణ పేరు మాత్రమే సమాధానంగా వస్తుంది

ఎక్కువ చిత్రాల్లో పనిచెయ్యడం ఆరోగ్యాన్ని బలహీనపరచగలదని కూడా లెక్కచెయ్యక, అందరినీ తృప్తిపరిచారు, కృష్ణ.

ఇకపై సంవత్సరానికి ఎనిమిది చిత్రాల్లో మాత్రమే నటించడానికి నిర్ణయించిన కృష్ణను అభినందించాలి. అంగీకరించే చిత్రాలన్నీకలర్‌లోనేనిర్మితమవుతాయి అని కృష్ణ గారన్నారు.

హీరో తీసుకున్న యీ నిర్ణయంపము చితమైనదేకాదు. సబలమైనదికూడా

## వద్దు అన్నవి రెండు పదులు

హీరోకృష్ణతో చిత్రం నిర్మించాలి అని ఎందరో వెళ్లారు. నాకు తెలిసి ఆయన "వద్దు" అని నిరాకరించినవి రెండు పదులు వుంటాయి కథలు నచ్చకకొన్ని, 'పలుపు—తెలుపు' అని మరికొన్ని ఆయన చెయ్యను అన్న తరువాత, మరొకరికి వెళ్లాయి.

వర్ధమాన నటిప్రభ



## శ్రీ రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్

విజయా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న వర్ణచిత్రానికి యిడిన పేరు ఎంత గమ్మత్తుగా వున్నదో చూశారా !

ఈ మకుటం అందరికీ అందుబాటులో వున్నదికదూ ! విచిత్రంగానూ వున్నది. . విశిష్టంగానూ వున్నది.

ఈ చిత్రానికి బాపు దర్శకుడు. సీట్ నెరేషన్‌వుంటుంది బాపు దగ్గర అన్నది ప్రజాభిప్రాయం.

ప్రేక్షకులకు ఆహ్లాదాన్ని, ఆనందాన్ని అందించేచిత్రంగా "శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్" రూపం అందుకొంటూ వుంది.

ఈ చిత్రానికి పద్మరాజా రచన్ను, పెండ్యాల సంగీతాన్ని, సుందరం బాబు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు

కృష్ణ, జగ్గయ్య ప్రధాన పాత్రలను పోషిస్తున్న యీ చిత్రంలో జయప్రద, జి. వరలక్ష్మి, పద్మనాభం, కాంతారావు, అల్లు రామలింగయ్య, రమాప్రభ సహతారాగణం

ప్రజానురంజకమైన చిత్రాలను అందించిన నాగిరెడ్డి — చక్రపాణిగార్లు ఆంధ్ర ప్రేక్షకులకు యివ్వబోయే మరొక మణిహారమే యీ చిత్రం.



''పెద్దింటి కోడలు''లో ప్రసాద్‌బాబు

## సినిమా

గెటప్‌లో అక్కినేనిని చూసినప్పుడు, ఖురవై ఏండ్లని అనిపించింది

క్షేత్రయ్య, ఆయన మేనకోడలు పాడిన యుగళ గీతాన్ని, జయసుధ అభినయించిన కవాలీని తొలి షెడ్యూల్లో పూర్తిచేశారు ఈ చిత్రానికి ఆదుర్తి దర్శకుడు ఆరుద్ర రచయిత ఆదినారాయణరావు సంగీత సారధి

పైన పేర్కొన్న వారితోబాటు అంజలీదేవి, కాంతారావు, రాజబాబు, ప్రధాన తారాగణంలో వున్నారు.

ఈ చిత్రానికి వి ఎస్ ఆర్ స్వామి, ఏ కే శేఖర్, వాలి, హీరాలాల్, మానికొండ మధుసూదన్, శేఖర్ సాంకేతిక శాఖల బాధ్యతను నిర్వహిస్తున్నారు

అక్కినేని చిత్రం తారకరామ, శ్రీ తారకరామ, నవభారత్ విడుదల చెయ్యడం చిత్ర విచిత్రమేకదా !

### అక్కినేని వయస్సెంత ?

లంజలి పిక్చర్ కంబైన్స్‌వారి ''మహాకవి క్షేత్రయ్య'' జులై 15న చాముండేశ్వరీ స్టుడియోలో ప్రారంభమైంది పది + మూడు రోజులు వరుసగా షూటింగు జరిగింది

మొదటి షెడ్యూలులో పాల్గొన్నవారు నాగేశ్వరరావు, ప్రభ, జయసుధ, ప్రభాకరరెడ్డి, హేమలత, రాధాకుమారి, ధూళిపాళ ''క్షేత్రయ్య''



''తీర్పు''లో సుజాత

### అక్కినేనితో సుబ్బరాజు చిత్రం

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ అధినేత ఎస్ వి సుబ్బరాజుగారిని, బెంగుళూరు చాముండేశ్వరీ స్టుడియోలో చూశాను ఏమిటిలా వచ్చారు అని ప్రశ్నించాను

''నట సామ్రాట్'' నాగేశ్వరరావుగారితో చిత్రం తీయదలచి, ఆయన అంగీకారం కోసం వచ్చాను అని చెప్పారు

ప్రజలు మెచ్చే చిత్రాలను అందించే అర్హత సుబ్బరాజుకు వున్నదిగాబట్టే, యిప్పటిదాకా విజయాన్నే చవిచూడగల్గుతున్నారు

సుబ్బరాజు తీసే చిత్రాలకు పి చంద్రశేఖర రెడ్డి పర్మినెంట్ దర్శకుడు

ఒకానొకప్పుడు రెడ్డి దర్శకత్వంలో పని చెయ్యడానికి అక్కినేని అంగీకరిస్తూ, నిర్మాతను ఆయన ఎంపికకు వదిలిపెట్టారు చంద్రశేఖరరెడ్డి తన కొచ్చిన అవకాశాన్ని, శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ అధినేతకు అందచేశారు

### జయప్రద భవిష్యత్తు

డాక్టర్ ప్రభాకరరెడ్డిగారి ''నాకు స్వతంత్రం వచ్చింది'' చిత్రం చూచిన తరువాత, అందులో నటించిన జయప్రదను గూర్చి నాలుగుముక్కలు రాయాలనిపించింది

జయప్రదకు మొదటి చిత్రమే అయినా, జంకులేనితనం, నటనలో సహజత్వం — సౌలభ్యం, డైలాగులు చెప్పడంలో నేర్పరితనం అగుపించింది ఇన్ని వున్న జయప్రదను, పరిశ్రమతోబాటు ప్రజ కూడా ఆదరించకుండా వుండగలరా ?

జయప్రద జాతక ప్రభావ మేమిటోగాని, పెద్ద దర్శకుల చిత్రాల్లో పనిచేసే అదృష్టం కలిసి వచ్చింది

కె బాలచందర్, కె విశ్వనాథ్, దాసరి, బాపు వంటి ఉత్తమ దర్శకుల వద్ద శుశ్రూష చెయ్యడంవల్ల, జయప్రద భవిష్యత్తు బంగారు పంటను పండించగలదన్న నమ్మకం అనేకులకు వున్నది

### అందరూ బాగుండాలి !

అందరికీ మంచి జరగాలి అనేడి మనస్తత్వం వున్న మంచిమనిషి పి పుల్లయ్యగారు పద్మశ్రీ పిక్చర్స్ వారి పదకొండవ చిత్రానికి ''అందరూ బాగుండాలి'' అని పేరు పెట్టడం జరిగింది

ఈ చిత్రంలో సత్యనారాయణ, పద్మనాభం, ధూళిపాళ, కొమ్మినేని శేషగిరిరావు, రాజనాల, సురేష్, శాంతకుమారి, సంగీత, కె విజయ, మమత, గిరిజ, జయవిజయ, సుశీల ప్రధాన పాత్రలను పోషించారు హీరోగా జగన్నాథ్ (శ్రీశైలం) అనే అందగాడు నటించారు

హైద్రాబాద్ సారథీ స్టుడియోలో నిర్మిత మైన యీ చిత్రానికి గొల్లపూడి రచన్ను, వేణు సంగీతాన్ని, లాల్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు

''సర్వే జనా సుఖినోభవంతు'' అనేడి నానుడిపై అల్లబడిన యీ కథను, సర్వజనరంజకంగా రూపొందించారు శ్రీ పుల్లయ్య శ్రీఫిలింస్ విడుదల

''వైకుంఠపాళి''లో చంద్రమోహన్, జ్యోతిలక్ష్మి



''గుణవంతుడు''లో అంజలీదేవి, శోభన్‌బాబు

### విజయనిర్మల విశిష్టత !

మిత్రులు కొందరు ''పిచ్చోడి పెళ్లి'' చిత్రాన్ని చూసొచ్చి, గొప్పగా ప్రశంసించిన తరువాత, ఆ చిత్రాన్ని చూడాలన్న తాపత్రయం ఎక్కువై, దర్శకుడు కె ఎస్ రెడ్డిగారిని చిత్రం చూపించమని అడిగి, మరీ చూడడం జరిగింది

చిత్రంలో నాకు నచ్చిన అంశాలు మూడే. ఒకటి కె ఎస్ రెడ్డి దర్శకత్వం రెండు విజయనిర్మల విశిష్టత మూడు రాజబాబు నటన

విజయనిర్మల నటించిన ఎన్నో చిత్రాలను చూశాను నాకు నూరు శాతం నచ్చిన చిత్రం ''మీనా'' నూటికి రెండు వందల మార్కులు యివ్వదగిన రీతిలో ''పిచ్చోడి పెళ్లి'' చిత్రంలో విజయనిర్మల నటించింది అని చెప్పే ధైర్యం నాకు ఏర్పడింది

స్త్రీలను విశేషంగా ఆకట్టుకునే విధంగా విజయనిర్మల నటించడం నిజం గాబట్టే, కె ఎస్ రెడ్డిగారిని యిక్కడ అందరూ అభినందించడం జరిగింది అక్కడ (ప్రేక్షక లోకం) ఆదరించడం జరుగుతుంది

### మనిషి - మృగము

''పిచ్చోడి పెళ్లి'' చిత్రాన్ని ఆగస్టు యిరవై రెండున విడుదలచేసి, సెప్టెంబరు నుంచి ''మనిషి — మృగము'' చిత్రం షూటింగును ప్రారంభించ దలచినట్లు, దర్శక—నిర్మాత కె ఎస్ రెడ్డి చెప్పారు

ఒక ఫారెస్ట్ ఆఫీసరు, అతగాడి కుమార్తె జీవితాల్లో జరిగే సంఘటనల హారమే ''మనిషి — మృగము'' అని దర్శకుడు చెప్పారు

ఈ చిత్రంలో క్యారెక్టర్ హీరో సత్యనారాయణ ప్రధాన పాత్రను పోషించగలరట గ్లామర్ హీరోగా నూతన నటుడు పరిచయం కావచ్చు



''సోగ్గాడు''లో జయసుధ, అల్లు రామలింగయ్య



''ఈ కాలపు పిల్లలు''లో రామకృష్ణ, ప్రభ

### గుణవంతుడు

శ్రీ విజయభట్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న చిత్రానికి ''గుణవంతుడు'' అని పేరిడినట్లు నిర్మాతల్లో ఒకరైన ఎస్. ఎస్. మూర్తిగారు చెప్పారు.

''హీ—మాన్'' ద్విపాత్రాభినయం చేస్తున్న యీ చిత్రంలో శృంగారం, హాస్యం, భయానకం, భీభత్సం, మరియు కరుణరసం సమపాళ్ళలో వుండడంవల్ల, అన్నితరగతుల ప్రేక్షకులను ఆకర్షించగలదు.

ఈ చిత్రానికి ఆదుర్తి, కన్నప్ప, జి. వి. సుబ్బారావు, హరనాథ్, మహాదేవన్ వంటి మేధావులు సాంకేతిక శాఖలకు ఆధిపత్యం వహిస్తున్నారు గానుక, సమిష్టి కృషి ఫలితము తథ్యము.

ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను మంజుల, అంజలీదేవి, కృష్ణకుమారి, కాంతారావు, ప్రభాకర రెడ్డి, ధూళిపాళ పోషిస్తున్నారు.

ఎస్. ఎస్. భట్ నిర్మిస్తున్న యీ వర్ణ చిత్రానికి అన్నపూర్ణా ఫిలింస్ పంపిణీదారులు.

### ఆరడుగుల దుష్టుడు

ఈమధ్య విఠలాచార్యగారి ''కోటలో పాగా'' షూటింగుకు వెళ్ళాము. అరోజా గురుకులాశ్రమం సెట్లో వాంప్ సత్యప్రియ కన్నులపండుగ చేసే నాట్యాన్ని ప్రదర్శించింది. ఆమె సరసన ఆరడుగుల అందగాడు జతగా నాట్యం చేశాడు.

అతడి పేరు సుదర్శనమ్ అని, తెలుగు తెరకు విలన్‌గా పరిచయమవుతున్నాడని ఆచార్యగారి ద్వారా తెలుసుకొన్నాము.

కన్నడ రంగంలో సుదర్శనమ్ పేరుమోసిన విలన్ నటుడుగా ఖ్యాతి నందుకొన్నారని తెలిసింది.

విలన్లు వేసే మనుషులు తెలుగు తెరకు తక్కువయిన యీ తరుణంలో సుదర్శనమ్ రాక లాభదాయకమే అవుతుంది.

''కోటలో పాగా'' చిత్రంలో నాయక పాత్రను రామకృష్ణ, నాయిక పాత్రను జయసుధ పోషిస్తున్నారు. సహాయ భూమికలను మిక్కిలినేని, రాజనాల, ముక్కామల, కేశవరావు ధరిస్తున్నారు. ఇదొక విచిత్రమైన జానపద చిత్రం.

### ప్రెసిడెంట్ పుల్లయ్య

సౌత్ ఇండియన్ ఫిలిమ్ ఛేంబర్ అధ్యక్షుడుగా పి. పుల్లయ్యగారు పదవీస్వీకారం చేశారు ఈయన్ను, సభ్యులందరూ ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

న్యాయాన్ని, నిజాన్ని ధైర్యంగా చెప్పగల గుణవంతుడు ప్రెసిడెంటు కావడం ముదావహం.

— శ్రీనివాస్



అందాలు చిమ్ముతూ
ఆకర్షణ వెద చల్లితే



## మీదారి పొడవునా చూపుల తోరణాలే !

లాక్మే వానిషింగ్ క్రీం మీ సౌందర్యానికి రాచబాట. మంచులో తడిసి, తొలికాంతిలో విరిసిన పూవులా మిమ్మ చేస్తుంది.

శ్రేష్ఠమైన మేకప్‌కు ఆదర్శవంతమైన ఆధారము లాక్మే వానిషింగ్ క్రీం. దీనిపై పౌడరు చాలాసేపు హత్తుకొనివుంటుంది.

ఎంతో తేట అయింది, ఎంతో సహజమైంది; అయినా ఎంత మార్పును తెస్తుంది.

**లాక్మే వానిషింగ్ క్రీం**

అద్దుకొన్న పౌడరును హత్తుకొని వుంచుతుంది.




మీ సౌందర్య పోషణ మా ఏకైక ఆశయం

లాక్మే

dCP LVC 2 o Te

పాతికేళ్ల జీవితంలో పడిన కష్టాలను, పడని సుఖాలను, తిన్న తిట్లను తినని స్వీట్లూ హాట్లను, కొన్న కీర్తిని, అమ్మిన

అసలును, వక్రించిన చంద్రుణ్ణీ, వక్రించని సూర్యుణ్ణీ అందరినీ అన్నిటినీ తలచుకొని నమస్కారం చేసి శ్రీకారం చుట్టబోయేసరికి తమ్ముడు 'హాచ్ఛ'ని ఒకే ఒక్క కల్తీలేని తుమ్ము తుమ్మాడు!

'ఆ తుమ్ము ఇంకోటి తుమ్మలేకపోయావా?' అన్నా.

'అసలుకే మోసమైతే వడ్డీకి చోటేది? ఇంతకు నీ ఘనకార్యం ఏమిటని తుమ్ము దగ్గిరే తుమ్మకంచెలా మీద పడ్డావ్?'

'ఇది నా జీవిత రజతోత్సవం. ఈనాటికి నేను




పుట్టి పాతికేళ్లయింది. ఈ పాతికేళ్ల జీవితాన్ని పురస్కరించుకుని!...'

'చిన్న సైజు పార్టీ ఎరేంజి చేశావా?'

'లేదు.'

'ఓ చిన్న సభ?'

'లేదు.'

'ఓ చిన్న సన్మానం?'

'లేదు.'

'కనీసం ఓ కొత్త చొక్కా?'

'అదీ లేదు.'

'ఇక లేవిదేది?'

'అదే తోచడంలా. ఆదిలో హంసపాదులా పాదులోనే పందికొక్కు కొట్టింది. ఇక యీ నా జీవనలత కృంగి కృశించి నశించి నాశనమయేలోగా ఒక చిన్న కథ రాసి పది – పదిహేను కాపీలు తీసి పుట్టి పెరుగుతూ చావబోయే ప్రతి పత్రికకూ పంపాలని నిశ్చయించుకుని...'

'నయమే? ఆడ పేరుతోనా? మగ పేరుతోనా?'

'ఛీ! ఆడపేరేమిటి? అయినా ఈ మధ్య ఆడవాళ్లే మొగాళ్ల పేరుతో కథలు రాస్తున్నారు – లేని మీసాలు మెలితిప్పుతూ – కయ్యానికి కాలు దువ్వుతూ...'

'బై ది బై! తమ రిప్పటికి ఎన్ని రచనలు చేశారు?'

'కనీసం రెండు వందలు.'

'ఎన్ని ప్రింటయినాయి?'

'ఓ ఇరవై.'

'ఏటే! ఏడాది కొకటి కూడా లేదే.'

'ఓరి నీ సరాసరి బంగారం కామా! పుట్టిన ఏడాదిలోనే కథ రాశానా? మదీయ ఇరవైయవ ఏట ముద్దు ముద్దుగా కథా రచన మొదలెట్టి టపా టపా ఏడాదికి మూడు కథలు – వెరసీ పదిహేను కథలు – రెండు కవితలు – రెండు వ్యాసాలు – అన్నట్టు ఓ ఉత్తరం –'

'అఘోరించావులేకాని – ఒక్కటి వాసియైన రచన...'

'వాసి? వాటీజ్ వాసి అండ్ వాటీజ్ నాసి? మన రచనల్లో నాసినాస్తి వాసి హస్తవాసి బట్టి అనుకో – అంటే పత్రికల పాఠకుల హస్తవాసి – కొందరు తిట్టారు – కొందరు దులిపారు – కొందరు దుమ్మెత్తిపోశారు – కొందరు పొగిడారు – కొందరు నవ్వారు – కొందరు ఏడ్చారు – అందర్నీ అన్ని వేళలా ఏడ్చేలా లేదా నవ్వేలా చేసేందుకు నేను బ్రహ్మదేవుణ్ణనుకున్నావా?'

'అదే నాన్సెన్స్! రచయిత కూడా బ్రహ్మదేవుళ్లాంటివాడే! రచన సప్త సంతానాల్లో ఒకటని అప్ప కవి ఘోషించలేదా? రవి కాననిచో కవి కాంచునేకదా?'

'అహా! అయితే నేను బ్రహ్మదేవుణ్ణన్నమాట? థాంక్యూ! కొత్త ఐడియా వచ్చింది – 'నేనూ బ్రహ్మదేవుణ్ణే!' అనే పేరుతో ఈ సందర్భంగా అందమైన కథ వ్రాసి...'

'తిప్పి పంపటానికి తగిన పోస్టలు బిళ్ల లంటించిన కవరుతో జత చేసి పంపిస్తావా?'

'అరె! ఈ ఆనందకర శుభ సమయంలో తిప్పి పంపే ప్రసక్తి ఏమిట్రా? శుభం పలకరా మంకెన్నా అంటే...'

'ఉన్న మాటన్నాను! నీవొక బ్రహ్మ వెలాగో – అలాగే ఎకౌంటాఫీసరువు కూడా! నీ ప్రెస్ మేటర్ రిసీట్ అండ్ డెలివరీ రెజిస్టర్‌ను ఆడిట్ చేయించావా?'

'డియర్ మిస్టర్ చిత్రగుప్తా! నా చచ్చిన ఆర్టికల్సును – అంటే సిగ్గు లేకుండా అయిదోమారు పంపిన ఆర్టికలును అంతకంటే పానుభూతాలు లేకుండా తిప్పి పంపగా రిసీవ్ చేసుకున్న ఆర్టికల్సును వన్స్‌ఫరాల్ ఒరిజినల్స్‌తో సహా వంటింట్లో కుంపట్రాజకెట్టే సెక్షనుకు డిస్పాచ్ చేశాను – అవి హవిస్సులా అగ్ని ద్వారా యముడికి ఈ పాటికి చేరే ఉంటాయి. ఇక బతికిన ఆర్టికల్సును – అంటే ఎవరో ఓ ఎడిటర్ మహాశయుడు ఇంతకంటే గతి లేక, కథ వేసుకుని ఫ్రీ కాపీ పంపే ఓపిక లేక మానేస్తే నేనే కొనుక్కుని నాకు నేనే సన్మాన సభ ఏర్పాటు చేసుకుని సింగల్ టీతో ఆత్మారాముడికి తృప్తి చేసి నామనస్సులోనే వెంకటేశ్వరస్వామి పాద పద్మాలకు కోటి నమస్కృతు లర్పించి...!

'ఖర్మకాలి వాటిని అంకితం చేయలేదుకదా?'

'మరే! ఆ పనే! ఖర్మ కాలిన పనే చేశాను – అప్పట్నుంచీ ఒక్క ఆర్టికలు పడితే ఒట్టు!'

'నెవర్ మైండ్ డియర్ బ్రదర్! నీ ఆర్టికల్సును తిప్పి పంపుతున్న ఈ ఎడిటర్లే ఒకనాడు నిన్నే ఆర్టికల్సు కోరే శుభ క్షణం రాకపోదు – ఆనాడు అరచేతి మందాన అలముకున్న నీ కీర్తి మేఘం – అందరు పేరుమోసిన రచయితల కీర్తి చంద్రికలను కాటేసి కలవర పెట్టేస్తుంది – బై ది బై – అప్పుడైనా పార్టీ చేస్తావా?'

'పెర్కలాం!'

'అదేమిటి? కామరాజ్‌లా?'

'ఆమ! పెర్కలాం!

'అన్నట్టు ఈ శుభక్షణంలో నీ ఆదాయ వ్యయాలను చెప్తే సంతోషిస్తాను.'

'ఏముందీ! రెండు వందల ఆర్టికల్సుకు బుక్ పోస్టు ఛార్జి అరవై రూప్యంబులు మాత్రము – ఆదాయం – ఆరు కథలకు ఫ్రీ కాపీలు – అందు రెండు కథలకు ఇరవై రూపాయలు'–.

'పోనీలే అన్నా! నేనుసైతం ప్రపంచాగ్నికి ఒక్క సమిధను ఆహుతిచ్చాను – అనుకో!'

'అవును! నేనుసైతం ప్రపంచంలో తెల్లరేకై పల్లవిస్తాను.'

'పల్లవించుగాని – ఈ శుభ సందర్భంలో నీకు ఏమని శుభాకాంక్ష లందించమంటావు?'

'ఏముందీ! వారానికి మూడు ఆర్టికల్సు చొప్పున పడి నెలకు వంద రూపాయలాదాయం వచ్చుగాక అని ఆకాంక్షించు!'

ఇంతలో 'పోస్టు సార్!' అన్న కేక విన్పించింది.

ఆదరాబాదరాగా ఇద్దరం వరండాలో కెళ్లాం – అతను చిరునవ్వు నవ్వుతూ, 'ఇవిగో సార్! మీవి రెండు ఆర్టికల్సు తిరిగొచ్చాయి...'

అప్పటికే నా మొహం నల్లబడింది –

'...అన్నట్టు ఒక కవరుకు మీరు పది పైసలు తక్కువ అంటించారు – అందుకని పోస్టలువారు మరో పది పైసలు అదనపు ఫైను వేసి సన్మానించారు!' అన్నాడు నా నల్లబడ్డ ముఖాన్ని తెల్లటి కళ్లతో చూస్తూ!

హతోస్మి! శ్రీ మద్రమారమణ గోవిందో హరి!

## వంటలూ - పిండివంటలూ

### గోధుమ సున్ని

మినపసున్ని చాలా మందికి తెలుసు కాని యీ గోధుమసున్ని ఎక్కువమందికి తెలియదు. ఇది కూడా రుచిగానే వుంటుంది అని కాకినాడ నుంచి పి. భానుమతిగారు రాస్తున్నారు. కావలసిన పదార్థాల లెక్కలు యిలా యిస్తున్నారు. గోధుమ పిండి మూడు గ్లాసులు, పంచదార రెండు గ్లాసులు, ఓ కప్పు కొబ్బరి కోరు, ఓ కప్పు మం . నెయ్యి, ఏలకులు కాసిన్నిచాలు. గోధుమ పిండిని, కొబ్బరి కోరును కొంచెం నెయ్యివేసి, దోరగా వేయించి, ఓ పళ్ళెంలోకి వొంపాలి. పంచదారని బాగాదంచి. ఆ గుండనీ పొడిలో కలపాలి. నెయ్యి బాగా కాగాకా, ఏలకుల పొడి కలిపి, వుండలు కట్టుకుని తింటే కమ్మగా బాగుంటాయిట !

## అవీ ఇవీ అన్నీ

### పెసరపప్పు మైసూరపాక్

వారే పెసరపప్పు మైసూర్‌పాక్ గురించి కూడా రాస్తున్నారు. ఓ గ్లాసు పెసరపప్పు అదే గ్లాసుడు శనగపప్పు, అదే గ్లాసులో రెండు గ్లాసుల పంచదార, నెయ్యి అరకప్పు, ఏలకుల పొడి కావాలి. పప్పులు రెండూ ముందుగా వేయించి (దోరగా చాలు) మెత్తగా పిండి విసురుకోవాలి పంచదార పాకంపట్టాక పాకం ముదురుతూండగా పిండికలిపి బాగా త్రిప్పాలి. ఆ తర్వాత నెయ్యిపోసి కలిపి ఏలకులపొడి వేసుకొని దింపేసింతర్వాత... అంతా మామూలు మైసూర్‌పాక్‌లాగే ముక్కలు కోసుకోడం గట్రా...

## అపరాజిత

శ్రీ బాపూ ముఖచిత్ర రచనతో వెలువడిన అపరాజిత నవల కుతూహల జనకమైన కధనం కల నవల. రచయిత్రి వై. రుక్మిణి. పుటలు 284. వెల 9 రూపాయిలు. ప్రతులకు ఛాయా పబ్లికేషన్స్ ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

### రాయలసీమ రచయితల చరిత్ర

20 వ శతాబ్దపు రాయలసీమ కవి రత్నాల చరిత్ర రచన : కవిభూషణ, కవితిలక్, శ్రీ కల్లూరు అహోబలరావు. 144 పేజీలు వెల ఎనిమిది రూపాయలు. ప్రతులకు: శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందుపురం.

### నిష్కృతి

నవల. రచన : శ్రీమతి ఆర్. ప్రమీలా కుమారి, 204 పేజీలు, వెల ఆరు రూపాయలు ప్రతులకు : నవోదయా పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## హిందీలో వెలువడిన కొన్ని తెలుగు రచనలు

*దండమూడి మహీధర్*

(1—8—75 సంచిక తరువాయి)

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో హిందీ డిపార్ట్‌మెంటులో రీడర్‌గావున్న డాక్టరు ఆదేశ్వరరావు, డాక్టరు చావలి సూర్యనారాయణమూర్తి డాక్టరు కర్ణ రాజశేషగిరిరావు, దండమూడి వెంకటకృష్ణారావు హిందీలో రచనలుచేసి హిందీ రచయితలుగా ప్రఖ్యాతి కొచ్చారు.

డాక్టరు భీమసేన్ నిర్మల్—తెలుగువాడైనా హిందీ నాటక కర్త అయిన నాదెళ్ల పురుషోత్తమ కవి నాటకాలమీద పరిశోధనా గ్రంథాన్నిరచించారు. 'రాజమన్నారుకే సాత్ ఏకాంకీ' 'ఘాట్‌కే దేవతా' ('చిల్లర దేవుళ్ళు) 'నదీసుందరి' (అబ్బూరి రామకృష్ణరావు) 'రూపనవనీల్' (రాయప్రోలు సుబ్బారావు) 'కవి శ్రీమాల' (తిరుపతి వెంకటకవులు, కటారి పింగళి కవుల కవితాను వాదాలు) 'బిఖరే మోతీ' (ఇల్లిందల సరస్వతిదేవి) 'పద్మాకర్' 'దీక్షితులు' (మునిమాణిక్యం) మొదలైన 28 గ్రంథాలు హిందీలో రచించారు.

'నూతిలోని గొంతుకలు' కావ్యం రచించి తెలుగు వచన కవిత్వంలో నూతన రత్నాన్ని ప్రవేశపెట్టిన శ్రీ ఆలూరి బైరాగి హిందీలో 'పలాయన్' అనే కావ్యం రచించి హిందీ కవులను దిగ్భ్రమ చెందేలా చేశారు.

శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు డాక్టరు కొమ్మూరి వేణుగోపాలరావుగారి నవల 'హవుస్ సర్జన్'ను హిందీలోకి అనువదించి మన తెలుగు నవలా సాహిత్యానికి పేరు ప్రతిష్టలు ఆర్జించి పెట్టారు.

ఇలాగే శ్రీ పి. వి. నరసింహారావుగారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ 'వేయి పడగలు' నవల ను 'సహస్ర ఫణ్' పేరుతో హిందీలోకి అనువదించగా భారతీయ జ్ఞానపీఠ్ వారు ప్రచురించారు. మహోత్కృష్ట అనువాదానికి ఈ నవలను తార్కాణంగా పేర్కొనవచ్చును.

తెలుగు భాషా సాహిత్యాలతో ఆటే పరిచయం లేకపోయినా హిందీలో అనేక నవలలు, కథలు విమర్శనా సాహిత్యం రాసి హిందీ రచయితలుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన వారిలో శ్రీ ఏ. రమేశ్ చౌదరి, శ్రీ వై. బాలశౌరిరెడ్డి ప్రముఖులని చెప్పవచ్చును. 'ధన్యభిక్షు' 'దూసర్ కేధోల్' 'పతితపావని' 'ఆదరణీయ' 'అపవాద్' 'అపనీ కర్నీ' మొదలైనవి శ్రీరమేశ్ చౌదరిగారి రచనలో పేర్కొనదగినవి ! ఈయన ఎంచుకున్న కథా వస్తువు ఎటువంటిదైనా భాషా విషయంలో మాత్రం ఈయనకు ఈయనే సాటి !

అయితే శ్రీ బాలశౌరిరెడ్డిగారి విషయంలో ఇలాగని చెప్పడానికి వీల్లేదు భావం మీద, భాష మీద కూడా ఈయనకు అంత అధికారం వున్నట్టు కన్పించదు. సాహిత్య అకాడమీ వారికి వీరు చేసిన అనువాదాలు 'రుద్రమదేవి' 'నారాయణ భట్టు' 'అల్పజీవి' ! వీరు అనువాదంచేసిన 'తెలుగుకీ శ్రేష్ఠ కహానియా' 'తెలుగు కీ ఉత్కృష్ట కహానియా' 'తెలుగు కీ బీస్ కహానియా' సంకలనాలలో ప్రాతినిధ్యం వహించే కథలను ఎన్నుకోవడం జరగకపోగా, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, ఏ.ఆర్. కృష్ణ, కేతినీడి నరసింహారావు మొదలైన వారిని కథా రచయితలుగా హిందీవారికి పరిచయం చేయడం హాస్యాస్పదంగా కన్పిస్తున్నది. ఇక అనువాదంకూడా అంతంత మాత్రంగానే వున్నది.

1931 లో హిందీలో వెలువడిన 'గల్ప సంసారమాలా—తెలుగు—7' అనే గ్రంథంలో విశ్వనాథ సత్యనారాయణ, చలం, బొడ్డు బాపిరాజు, మునిమాణిక్యం: ముద్దు కృష్ణ, అడివి బాపిరాజు, మల్లాది రామకృష్ణశాస్త్రి, కరుణ కుమార్, వెంపటి నాగభూషణం, పి. కె. రాఘవ శాస్త్రిగార్ల కథలున్నాయి. ఇటువంటి ప్రామాణిక అనువాదం గ్రంథం హిందీలో ఇంతవరకు వెలువడ లేదంటే అతిశయోక్తి కాదేమో ! ఈ కథలను అనువదించినవారు శ్రీ గజానందన్‌శర్మ, వేమూరి ఆంజనేయశర్మ యలమంచిలి వెంకటేశ్వరరావుగార్లు !

ఈనాటి తెలుగు కథా సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించే శ్రీయుతులు రాచకొండవిశ్వనాథశాస్త్రి, బీనాదేవి, ముళ్ళపూడి, పురాణం, తిలక్, మంజుశ్రీ, రమాదేవి, సీతాదేవి, తురగా జానకీరాణి, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, తాళ్ళూరి నాగేశ్వరరావు, సత్యం శంకరమంచి, గొల్లపూడి మారుతీరావు, నవీన్, చలసాని ప్రసాదరావు, ఇస్మాయిల్, హితశ్రీ, నార్ల చిరంజీవి మొదలైన వారి రచనలెన్నో ప్రముఖ హిందీ పత్రికల్లో ప్రచురించబడి హిందీ కథకుల రచనలకు తీసిపోవని నిరూపించడం జరిగింది. అయితే ఇలాగే మన సాహిత్యంలోని వివిధ ప్రక్రియలకు చెందిన గ్రంథాలు హిందీలోరావాలని మనమంతా కోరుకోవాలి.

## చిలకలు

(11వ పేజీ తరువాయి)

చూస్తోంది... బంగారంలాంటి పిల్ల యేమైపోతుందో అని కంగారుపడిపోయి...దూరంగా పంపించేస్తే వాణ్ణి మరిచిపోతుందేమోనని... తున్నో మా అబ్బాయుంటేనూ ... వాడి దగ్గరికి పంపించేసేం ... కన్నకడుపు కదమ్మా...పుండబట్టక వెళ్ళున్నాను.''

పంజరంవేపు చూస్తోంది పూర్ణ.

''ఆ చిలక సందడిలో పడేనా ఆ దిక్కుమాలినవాణ్ణి మరిచిపోతుందేమోనని...''

తెల్లబోయి చూసింది పూర్ణ.

''మా పాలిట బాగా దాపురించేడు... వాడి కులవేవిటో బెలవేవిటో ... వూరూ పేరూ యేవిటో ... ముక్కూ మొహావూ తెలీని వాళ్ళచేతుల్లో యెలా పెట్టేస్తావమ్మా పిల్లనీ? ఆది తీరింతరవాత ఆ వెధవ తన్ని తగిలేస్తే ... దిక్కూ మొక్కూ చెప్పూ ...అదే అయినవాళ్ళయితే నలుగుర్లోనూ పెట్టి నిలదీసి అడగొచ్చు...మన కళ్ళముందుంటుంది పిల్ల.''

''దగ్గిరేవిటి దూరవేవిటండీ...హుం... ఏవిటో మీ పిచ్చిగానీ...'' గొణుగుకుందిపూర్ణ

''నువ్వూ అదే మాటంటున్నావూ...మీకు తెలీదు...మేంచెబితే వినరూ...చచ్చీ చావూ... కడగొట్టుదిగదా అని కొంచెం గారాబం చేస్తే ... కడుపులో చిచ్చు పెట్టింది ... ఏం. పిల్లలో యేవోఁ...''

కళ్ళొత్తుకుంటూ సణుగుతోందావిడ. ఎలమంచిలీ నక్కపల్లీ యెప్పుడు దాటిపోయాయో మాటల్లోపడి మరిచిపోయాం. ఎడ్లబళ్ళు అడ్డుగావస్తే తుని బ్రిడ్జిమీద పెళ్ళినడకలు నడుస్తోంది బస్సు.

''అమ్మోయ్ ... బామ్మా ...'' కంయ్ మన్నాడు కుర్రాడు

''ఏం కొరికిందా ... మంచిపనైంది వెధవా ... నా పుట్టలో వేలెడితే కుట్టనా అందిట'' అందావిడ నవ్వుతూ.

''ఆ కథ నాకూ తెలుసు...'' అన్నాడు కుర్రాడు వుక్రోషంగా, చూసి వేలు నోట్లో పెట్టుకుంటూ.

''మా కథలే తెలియవు...'' చిన్నగా నవ్వి కుర్రాడి వేలుమీద ముద్దెట్టుకుంది పూర్ణ.

''మా బాగా చెప్పేవు తల్లీ...యీ చిలకతో నేనా దాని మనసు మారితే...ఆ దిక్కుమాలిన వెధవని మరిచిపోతే...తంబ్రశ్రీ .. నారాయణ మూర్తి...నీ కొండకి తీసుకొచ్చి వ్రతం చేయిస్తాను'' అన్నవరం కొండవేపు చేతులుజోడించి మొక్కులు మొక్కేస్తోందావిడ.

తునిలో బస్సాగింది. పంజరాన్నీ మనవణ్ణీ పట్టుకుని మెల్లిగా బస్సుదిగి వెళ్ళిపోతూ.

''లక్షణంగా దగ్గర సంబంధం చేసుకున్నావు...హాయిరంగామని కాపరం చేస్తున్నావు...అమ్మగారింటికెళ్ళున్నావు లేకపోతేనా నిన్ను తీసుకెళ్ళి బుద్ధి చెప్పించి వుందును... వెళ్ళిరా తల్లీ...''

వెలవెలబోయి నా మొహంలోకి చూసింది పూర్ణ. నా మనస్సు కలుక్కుమంది.

''అమ్మోయ్...మళ్ళీ కొరికిందే బామ్మా'' గబుక్కున వేలు లాగేసుకున్నాడు కుర్రాడు.

బస్సు కదులుతోంది.

పచ్చని వెచ్చని గుబురుల్లో రెక్క విప్పిన చక్కదనం, పట్టి పంజరంలో మూసేసినందుకు తిరగబడి కటుక్కున కొరుకుతోంది...

మనచుట్టూ మనవే పంజరాలు కట్టేసుకుని, అందులోపడి కరవలేక మింగలేక గిజగిజ తన్నుకుచస్తున్నాం. బతాణీ గింజలా బతుకు మనల్ని మచ్చిక చేస్తోంది.

'లక్షణంగా దగ్గరసంబంధం చేసుకున్నావు' ఆవిడ... మాటలు గింగురుమంటున్నాయి.

మేనత్త కొడుకనీ, అయినవాడనీ చేరదీసి చదువు చెప్పించి ''పూర్ణని చేసుకుంటావురా బావా'' అన్నాను.

''యీపంచదార చిలక నాదిరా బావా... యీ చందమావఁ నా కోసవే పుట్టిందిరా'' అని వాడు మురిసిపోతుంటే సిగ్గుపడిపోయింది పూర్ణ.

''అబ్బా...యిదీ చదివేవురా బావా'' అని ఎగతాళి చేసి అయిదేకరాలు యిచ్చి మరీ పెళ్ళి చేసేను. అదికూడా అన్నవరం కొండమీద.

కాని వాడు ఆ చదువులే చదివేడనిపోల్చుకోలేకపోయేను.

మనసూ మమతా సమస్తం వాడికే ధారబోసింది పూర్ణ. అస్తంతా హారతికర్పూరంగా హరించేసి— ఆడదనేది అగ్గిలో దూకి చచ్చే అపనింద అంటగట్టి., కోర్టులో విడాకులిచ్చి; కుక్కలాగ తరిమేసేడు.

బస్సు పరుగులెత్తుతోంది. అన్నవరం కొండ మలుపు తిరుగుతోంది.

బతుకులో యింకా యెంతదూరం వెళ్ళాలో.

బతికి నన్నాళ్ళు ఆదరించగలను. కాని మనువు మరిపించగలనా? పుట్టెడుదుఃఖంతో పుట్టింటికొస్తోంది పూర్ణ.

ఏం చెయ్యనూ?

నేనూ ఓ చిలకని కొనిపెట్టనా?

రివ్వుమనే గాలి. ఎముకలు కొరుక్కుతినే చలిగాలి. అదృశ్యంగా అలలు అలలుగా హస్తాలు చాపుతూ యింకా యింకా ఎన్నో పొదివి అదుముకోవాలని ఉబలాట పడే శీతలపు గాలి ఒళ్లు జలదరిస్తోంది.

అలవోకగా స్పృశిస్తోంది చలిచలిగాలి. వెచ్చదనం కోసం అర్రులు చాస్తోంది. సిగ్గూ ఎగ్గూ లేక విచ్చలవిడిగా తిరుగుతోంది ఈదురి గాలి. చెవుల్లో సూదుల్లా పొడుస్తోంది. కోనిఫర్ అరణ్యాలలో, కులూ లోయల్లో ఎల్లాంటి చలిగాలి కొడుతుందో తెలియదు. యిక్కడే యిలావుందే ?! అనుకున్నాడు శివయ్య. చలి గాలిని శాపనార్థాలు పెట్టాడు. మళ్లా ఆలోచించసాగాడు. 'అది సరేగాని గాలిలో యింతటి విచిత్రమైన సవ్వడి ఎలా పుట్టు కొస్తుందో చెప్మా. ఎవరో లీలగా గుసగుసలు పోతున్నట్లు – దూరాన ఎవరో ఎలుగెత్తి పిలుస్తున్నట్లు – ఎవరో ఆప్యాయంగా భుజాలపై చేతులువేసి ఒళ్లంతా స్పృశించి నట్లు – ఏదో అనుభూతి, ఏదో ఆవేదన – ఏమిటిది ? ఏమిటిది ? అది శరీరానిదేనా ? ఆత్మది కూడానా ?

దూరంగా చీకట్లో సముద్రం కెరటాల హోరు. ఒడ్డుకొచ్చి కొట్టుకుంటూ అలలు. ఆలోచనలను రేకెత్తిస్తున్నాయి. "ఎన్నాళ్లీ ఒంటరి బతుకు శివయ్యా! అంటున్నాయా? ఏమో! అదిగో! ముదిరిపోతున్న చీకట్ల నుండి ఏదో వెలుగు రేకలు నాజూగ్గా దూసుకొస్తున్నాయి. ఆ వెలుగు చుట్టూ వలయాలు వలయాలుగా మంచు పొరలు తెరలు తెరలుగా వాయువీధుల్లో వ్యాపించి వెలుగుకి అడ్డం వస్తున్నాయి కాబోలు ఒకసారి కన్పించి మరోసారి కన్పించడంలేదా వెలుగు! అది నడి సముద్రంలో ఎత్తైన స్తంభంపైన అమర్చిన దీపం కాబోలు! దారి తప్పిన ఓడలకు, పడవలకు దారిచూపే దీపం అయి ఉంటుందది. సముద్రం అలలు ఆ స్తంభానికి కొట్టుకొంటున్న ధ్వని. దానితో పాటు గాలిలో నీటితో బాటెగిరే పెద్ద పెద్ద చేపల ధ్వనులు. నీటి తుంపురులు మంచు తెరల్లో శీతల వాయువులో కలసి మరింత చలి పుట్టిస్తున్నాయి." అనుకున్నాడు శివయ్య పళ్లు పటపట మనిపిస్తూ.

వెంటనే శివయ్యకు చిన్ననాటి సంఘటన ఒకటి గుర్తుకొచ్చింది. ఎప్పుడో చిన్నప్పుడు



# ఏకాంతం

## ముదివేడు ప్రభాకరరావు

తాను మేనమామ ఊరెళ్ళినప్పుడు సముద్ర తీరానికెళ్ళాడు. తాను, మేనమామ, ఆయన కూతురు పార్వతి. తామిద్దరూ కాస్త ముందు నడుస్తున్నారు. మేనమామకు స్నేహితుడెవరో తగిలాడులాగుంది. వెనకబడ్డాడు.

ఇంతలో సముద్రం కలగుండు పడినట్లు కోటానుకోట్ల పాముపుట్టలు పగిలి పాములన్నీ తల్లడిల్లి పెల్లుబికి పోయినట్లు వాటి వెక్కసమైన బుసబుస ధ్వనులన్నీ కలసి ఒక్కసారి రోదసిలో ప్రతిధ్వనించినట్లు ఒక పెద్ద కెరటం ఓ తాబేలును ఒడ్డుకు తోసి వేసింది. తామిద్దరూ ఒడ్డు మీద నిల్చోనున్నారు. ఎప్పటికప్పుడు ఆ తాబేలు సముద్ర గర్భంలో .తలదాచుకోవాలనుకొన్నా ఆ సముద్రం దానిని తనలో యిముడనీయడం లేదు. ఏదో ఓ పెద్ద అలజడి పుట్టించి ఓ కెరటంసాయంతో ఆ తాబేలును అమాంతం తీసుకొచ్చి ఒడ్డుపై గిరవాటు వేస్తోంది. తాబేలు మళ్లీ గున గున నడుస్తూ సముద్రం వైపుకే దారితీస్తోంది. ఎన్నిసార్లిలా జరిగిందో తెలియదు. అదిగో కెరటం తాబేలును ఒడ్డుకు తోస్తోంది. ఇంతలో పార్వతి కుతూహలంగా దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నిస్తోంది.

'వద్దు. పార్వతీ. వద్దు. పాపం! దాన్ని వదిలేయ్' అన్నాడు తాను.

'ఊహుఁ నే దీన్ని వదలను. పట్టుకోవాల్సిందే' అంది పార్వతి.

"పాపం! దానికి సముద్రంలోకి వెళ్లాలని వుంది పార్వతీ వదిలేయ్ దాన్ని"

"అయితే సముద్రం దాన్ని నా కాళ్ళ దగ్గరకు తోస్తోందే. అదినాకే, దీన్ని నేనింటికి తీసుకెళ్తాను" అని పార్వతి ముందుకురికింది.

"పార్వతీ! దయచేసి వదిలేయ్ పార్వతీ! దాని దారిన దాన్ని పోనీయ్"

"నీకెందుకు దీనిమీదింత దయ! మా యింటికి తీసుకెళ్లి రోజూ నేను దీన్తో ఆడుకొంటాను" అంది పార్వతి.

ఆ దురదృష్టపు తాబేలు ఎన్నిసార్లు తానద్దుకొన్నా మళ్లీ మళ్లీ ఒడ్డుకే చేరి పట్టుబడిపోయి పార్వతి ఒడిచేరి చివరకి వాళ్లిల్లు చేరింది. ఆ రోజంతా ఎందుకో తన మనస్సు మనస్సులోలేదు. తాబేలుని తీసుకెళ్లి తిరిగి సముద్రంలో విసిరివేయాలనిపించింది. ఆ రాత్రంతా తనకు నిదుర పట్టలేదు. చివరికి తన ఊరెళ్లిపోయాడు అక్కడ ఉండలేక. తరువాత ఎప్పుడో తెలిసింది. ఓసారి పార్వతి తాబేలును బావి గట్టుపై పెట్టి ఆడుకొంటూండగా అది కాస్త జారి బావిలో పడి పోయిందని. 'హమ్మయ్య' అనుకొన్నాడు ఆనాడు అప్రయత్నంగా. నిట్టూర్పు వచ్చింది తెలియకుండానే.

"అవును...తనకూ ఆ తాబేలుకూ ఏమిటి సంబంధం? , పార్వతి అన్నట్లుగా తానెందుకు దానిపై అంతగా జాలిపడాలి? ఆ తాబేలు లాంటి వాడా తాను. ఏమో! కావచ్చు. కాకపోవచ్చు"

ఇంతలో ఎవరో 'శివయ్యా! ఓయ్! శివయ్యా! ఓహో శివయ్యా' అంటూ తలుపు పెద్దగా తట్టే చప్పుడు. వచ్చారు ఎవరో. ఎవరో వచ్చారు. ఎవరబ్బా యీ చలిగాలిలో యీ అర్ధరాత్రిలో యీ ఊరి బయట పదిమైళ్ల దూరానికి అడ్డంగా పడి

నడిచివచ్చి తనకోసం అందులో తనలాంటి అనామకుడి కోసం యింత హడావుడిగా యింత బాగా పిలిచేదెవరబ్బా. ఎవరై యుండొచ్చు. అనుకొనేటంతలో మళ్ళీ ఇంకో సారి అదేపిలుపు. అదే చప్పుడు. "ఓ శివయ్యా! ఓహో శివయ్యా!"

"అహ. తన చెవులు సరిగ్గా పని చేస్తున్నాయా అని. లేకపోతే తాననుకొన్న మాటలు విని ఏదైనా గాలీ గీలీ అంటోందా? కొంపతీసి నిజంగానే ఏ దయ్యమో గియ్యమో కాదుకదా? కాకుంటే యింత ఆర్భాటంగా అట్టహాసంగా తన్నెవరూ పుట్టి బుద్ధెరిగి పిల్చినట్లు గుర్తులేదు సరికదా అస

ఊరవతల వాటర్ మిషన్ దగ్గర ఎప్పుడో రో జుకో రెండో మూడో రైలింజన్లు వచ్చి నీళ్ళు నింపుకుపోయే ఊ౦ా శ్మశానంలాంటి పూరిగుడిసె ఉండే చోటికి ఎవరయ్యా అంత పనిగట్టుకొని వచ్చి తన్ను పిలిచేది? ఏదీ చూద్దాం? తీయ్ తలుపు అని లోపల అనుకొంటూ శివయ్య మంచం నుండి కిందికి దిగాడు. శివయ్య మెల్లగా అడుగుల్లో అడుగులు వేస్తూ నడిచాడు. ఎందుకైనా మంచిదని చేతికో కర్రలాంతరు తీసుకొన్నాడు శివయ్య తలుపు చప్పుడు కాకుండా గొళ్లెం తీశాడు. తలుపు తెరిచాడు శివయ్య. అంతే. ఛెళ్లుమని చాచి చెంపపెట్టు పెట్టినట్టు, ఓ పెద్ద తిమింగలం సముద్రంలో బలమైన తోకతో నీటిని కోలాహలం చేసినట్లు బర్రుమని ఈదురుగాలి కొట్టింది. వంద కత్తులు ఒక్కసారి శరీరంలో దిగవేసినట్లయింది..

'ఏదీ ఎవరూ కనపడరేం' అనుకొంటున్నారు శివయ్య లోపల ఎవరో. దీని దుంపతెగ! ఇదేదో గాంచేష్టలే సుమా! కాకుంటే తన చేతిలోని దీపం సముద్ర మధ్యంలో పారేసినా ఎంచక్కా వెలిగేది, తలుపు తెరిచీ తెరవక ముందే ఠపీమని ఆరిపోయిందే. దీని తస్సాగొయ్యా! ఇదేదో గాలి సంబంధమైన వ్యవహారమేనురోయ్'అనుకోవడమే తరువాయి అంతే తలుపులు మూతపడ్డాయి. వెంటనే శివయ్య శరీరం కుక్కిమంచంలో ముడుక్కొనుంది. ఒళ్లంతా వేయికాళ్ల జెర్రిపాకినట్లయింది శివయ్యకు. ఇదంతా తానే చేస్తున్నాడా? ఎవరైనా చేయిస్తున్నారా? తానేం దడుసుకోలేదు కదా! చలీ జ్వరం రాదుకదా తనకు? అనుకొన్నాడు శివయ్య గజగజ వణుకుతూ.

అప్పుడెందుకో శివయ్యకు నాయనమ్మ చలిగాలి మీద చేసిన ప్రసంగం గుర్తుకొచ్చింది. నాయనమ్మ అంటూండేది కదా! 'అబ్బబ్బా! ఏం చలి గాలిరా శివయ్యా! శివశివామంటూ శివనామం జపిస్తున్నట్లు. చెట్లకింద ఎండి రాలిపోయి గలగల్లాడుతున్న ఆకులమధ్య గోధుమవన్నె త్రాచులు స్పర్శన పాకిపోయినట్లు, పడగెత్తిన త్రాచుపాములు బుస్సుమని తల నేలకేసి కొట్టినట్టు చెన్నపట్నంలో తుస్సుమని బస్సులు దూసుకుపోయినట్లుందిరా'అని:

నాయనమ్మ యింకోమాట కూడా ఎప్పుడూ అంటుండేది. ''శిశిరం దాటాలా సిన్నోడా! ఈ సలిగాలి 'శివ శివా' మంటూ యాడికో పరుగులు తీస్తాయి. అందుకేరా నీకుశివయ్యని పేరెట్టింది. ఇప్పుడు అగ్గి దేముడు కూడ ముసిలాడిలా వణుకుతాడురా వాయుదేముడి ముందు''అని.

అప్పుడు తానన్నాడు గదా! ''అట్టాగైతే నాయనమ్మా! అందరికంటే శివయ్య దేముడు పెద్దోడా?''అని.

''మా నాయనే ఎంత తెలివో మానాయనకి! అవునే బుజ్జికొండా'' అంది నాయనమ్మ బుగ్గలు నిమురుతూ.

''అవును. అదంతా తన కిప్పుడెందుకు జ్ఞాపకం వస్తున్నట్లు?'' అనుకొన్నాడు. శివయ్యకు నిద్ర పట్టలేదు. నిద్రమత్తు కాస్త వదిలింది. మంచం మీద లేచి కూర్చున్నాడు. దుప్పటి ఇంకా వదలడానికి మనసు రాలేదు. ఇంకాసేపటికి ఓ రైలింజన్ రావాలి. దానికి దాహమంటే దాహం కాదు. దాని కుండేది కడుపో చెరువో తెలియదు. అయితే అదొస్తే ఒక లాభం తనకు. అదేమంటే యింజన్ డ్రైవరు మరిడయ్య కాలిపోయిన రాక్షసిబొగ్గు నంతా కిందికి తోసేస్తాడు. బాగా సల సల కాగుతున్న నీళ్ల ఎక్కువైపోతే తనకెంత కావాల్నో అంత బొక్కెన్లో నింపుతాడు. మిగిలింది క్రిందికి వదిలేస్తాడు. అప్పైన తానేం చేయాలి? తన కెలాగూ నిదుర పట్టదు. వాళ్ళు యింజనుకు కొత్త నీళ్లు నింపుకొనేంతవరకు ఆ పనివాళ్లతో పిచ్చాపాటీ పెట్టుకోవటం! ఆ యింజను గాడీ వెనక్కి వెళ్తానే కుంపట్లో ఆ రాక్షసి బొగ్గు కణికల్ని తీసుకొచ్చి వెచ్చగా చలి కాచుకోవడం. వేణ్ణీళ్లు ఎలాగూ ఉన్నాయి కాబట్టి అవి చల్లారిపోకముందే కాలకృత్యాలు తీర్చుకోవటం కానిచ్చి యింతలో, ఎలాగూ తెల్లారుతుంది. ఇంకో రైలింజన్ వస్తుంది. వాడొస్తే తనకు సంతోషం. ఎందుకంటే స్టేషన్ హోటలు నుంచీ వాడు వేడి వేడి యిడ్డెన్లు, ఓ చెంబులో కాఫీ పట్టుకొస్తాడు.

అవి అవురావురుమని తినటం, ఆ వేడి కాఫీ గొంతులో పోసుకొంటే అప్పటికి ప్రాణం లేచి వస్తుంది. ఈ తతంగం కానిచ్చిన తర్వాతనే యిహ వాడితో మాటలు పలుకులు. అంతకు ముందు వాడు అరిచి గీపెట్టుకున్నా ఉలికేది లేదు పలికేది లేదు. వాడి పని ముందా? తన పని ముందా?

తాను రాత్రింబవళ్లు ఎందుక్కాచుకోవటం యిక్కడ? వచ్చిపోయే రైలింజన్లకి నీళ్లు నింపటం కోసం. అది తన ఉద్యోగం! తనకేం పెళ్లామా? బిడ్డలా? ఒంటిగాడు. తాను కడుపులో పడుతూనే నాయన పోయాడు. నేలమీదపడి ఏడ్చే ఏడ్పులోనే అమ్మ చావుకూ ఏడ్చేశాడు. నాయనమ్మ కళ్లలో వత్తేసుకొని పెంచింది. 'ముండ పెంచిన బిడ్డ ముక్కుతాడు లేని ఆబోతు' అంటుందిరా లోకం అని నాయనమ్మ మాటి మాటికి హెచ్చరించేది. తన స్కూలు చదులౌతూనే ఆమె కాస్త కన్ను మూసింది. తాను ఏకాకి అయ్యాడు. ఓ మేనమామ పేరుకైతే ఉన్నాడు గాని వంగతోటలో మాపూ అనకూడదు. ఎవళ్ల బతుకులు వాళ్లు బతుకుతున్నారు ఎవరి కెవరు ఈ ప్రపంచంలో! అనుకొన్నాడు. కానీ అది మంచి గుణపాఠమే తనకు.




ఎలాగో ఏడాది తిరక్కముందే ఉమాపతి గారు తనకీ పని యిప్పించారు. ఇదారేళ్ల యింది తానీ ఉద్యోగంలో చేరి. వచ్చిన

మిజిన్న కాలే కడుపులకు చన్నీళ్లు నింపితే అది తన కడుపు నింపుతుంది. తన బతుకు వల్లగా గడుస్తుంది,

ఇంతలో రైలుపట్టాలు దడ దడ లాడిస్తూ రైలింజన్ వచ్చేసింది, "ఓయ్! శివయ్యో! యింకా తొంగున్నావేంటెహె! లెగు! లెగు! బేగిరం లగెత్తాలె బండి! ఈతలికే సానానేటయింది! టేసన్ అయ్యోరు కోప్పడతుండారో" అంటున్నాడు డ్రైవరు మరిడయ్య.

"ఆఁ ఆఁ వస్తున్నా ఉండయ్యా మరిడయ్యా! మారెమ్మలాగా దూసుకోస్తావ్ అంతట్లో పోవాలంటావ్ ఏలా నీతో" అంటూ



## ఏకాంతం

నీళ్ల పంపు వదిలాడు శివయ్య.

"ఆర్నీ తస్సాగొయ్యా! నీ వుద్దేగమంటే వుద్దేగమయ్యా శివయ్యో! కాళ్మీద కాలెట్టుకొని కూసునే వుద్దేగం. రాజులికి కూడా సిక్కదనుకో! శివయ్య దేముడు గంగమ్మ 'హోర్ని తల మీదెట్టుకొన్నాట! అట్టాగా మన శివయ్య పైనించి పంపుతో వొదుల్తేనే మన యింజన్కి నీళ్లు. నేకుంటే మన బండెట్టా నడుస్తాదంట!" అన్నాడు మరిడయ్య బీడీ దమ్ము లాగుతూ.

"నీ హాస్యాలకేం లే మరిడయ్యా! అదిసరే గాని యింతకీ ఏమిటి విశేషాలు!" అన్నాడు శివయ్య కుతూహలంగా.

"ఆఁ యిసేసాలు మాకేం తెలుస్తాయి శివయ్యో. మేమేఁ నీకిమల్లే ఇసుకూల్లో వదువుకొన్నావా,యేంటి. అదిరేగానీ శివయ్యో ఓ రగస్యం! యీడ నీకాడికి సుక్కలేవైనా వస్తయ్యా ఏహె! నా రంగ! నీవు యీడికి రాకముందు నజీరు వుండే వోడులే! నా సామి రంగ. రోజుకో పిట్టరుసి సూపే వోడంట. నా కదంతా వొర్నించి వొర్నించి సెప్పేవోడులే! నిజమేనా శివయ్యో!" అన్నాడు మరిడయ్య ఉబ్బితబ్బిబ్బవుతూ.

"నేనట్లాంటి వాణ్ణయితే మరిడయ్యా! ఇవాల్టికి నేనొచ్చి ఐదారేళ్ళయింది కదా! అజాపజాలేకుండా పోయేవాణ్ణి! నీవే అంటూంటావుగా నేను యిక్కడికి వచ్చిన తర్వాత గుళ్లో నందిలా బలిశానని" అన్నాడు శివయ్య.

'అవునవును నిజమే మరి—మరి నీ కట్టాంటోళ్లు సిక్కలేదంటావా? " అన్నాడు మరిడయ్య మెడ నిక్కించి.

"ఆఁ అంతా వచ్చారు. వచ్చినదారినే పోయారుకూడా" అన్నాడు శివయ్య నిర్లిప్తంగా.

"ఎట్టా ఎట్టా కాస్త యివరించి సెప్పయ్యా బాబూ" అన్నాడు మరిడయ్య.

'ఈ బోర్డులో ఏమి రాసి వుందో చెప్పకో చూద్దాం' అన్నాడు శివయ్య.

"అదా! అది సానా పాయం బోర్డిలే" తడుముకోకుండా చెప్పాడు మరిడయ్య.

"అపాయం,అంటే 'డేంజర్' అందుకేదాన్ని ఎర్ర రంగులో రాసారు. ఇదే వాళ్లకు ఫలితం తెలిసిందా" అన్నాడు శివయ్య నవ్వుతూ.

"అబ్బ సంపేత్తుండవు కదయ్యా శివయ్యా యిసేసాలు సెప్పమంటే" అన్నాడు మరిడయ్య ప్రాధేయపడుతూ.

"ఆఁ అలా అడిగావూ బాగుంది చెప్తా విను. నే నిక్కడికి వచ్చిన కొత్తల్లో ఒక నాడో గమ్మత్తు జరిగిందిలే. ఆ నాడేం జరిగిందంటే అప్పుడే తెల్లవారుతూ ఉంది. నే నేదో పుస్తకం చదువుతూ కూర్చున్నాను బయట. పడుచులు కొందరు పాలూ పెరుగూ తీసుకొని రైలుకట్ట మీదుగా పోతున్నారు నన్ను చూసి కిలకిలా నవ్వి'పాలు కావాల్నా సిన్నోడా' అన్నారు. 'వద్దు' అన్నాను నేను ముక్తసరిగా.' 'పాల గిన్నెను కావాల్సిన పన్లేదులే. వెచ్చగా నే ఉంటాయి' అంది యింకొకతె. నే మాట్లాడలేదు. 'పెరుగు గట్టిగా కమ్మగా ఉంటుంది. వేలుకూడ దిగదుకావాల్నా పడుచోడా!' అన్నారు ముసిముసి నవ్వుతూ. నేను ఉలకలేదు. పలకలేదు. ఎవరో కొత్త గుంటడల్లే ఉన్నాడే రంగి. బెల్లంకొట్టిన రాయిలా కూకున్నాడే' అంది మెల్లగా ఒకతె. 'ఆఁ అంతా వసాల్లే. రెండ్రోజుల్లో మన ఎంట పడడూ' అంటూ వెనక్కి తిరిగి చూస్తూ కిల కిల నవ్వుతూ వెళ్లారు వాళ్లు.

నేను చూసీ చూడనట్లు ఊరకుండిపోయాను. ఆ తర్వాత వాళ్లు వస్తూ పోతున్నప్పుడు ఏదో విధంగా రోజూ వెక్కిరిస్తుండేవారు. ఆరోజు ఎందుకో త్వర్గా చీకటి పడిపోయింది. నాకు తలనొప్పిగా ఉంటే లాంతరు వెలిగించకుండానే లోపల పడుకొన్నాను. ఇంతలో ఉన్నట్టుండి ఓ గావుకేక విన్పించింది. అది స్త్రీ గొంతుక అని స్పష్టంగా తెలుస్తోంది. వెంటనే నేను అదరాబదరా పరిగెత్తివచ్చి చూచాను. చీకట్లో సరిగ్గా కన్పించడంలేదు. అగ్గిపుల్ల గీచాను. "ఎవరది?" అన్నాను గంభీరంగా

"నేను బాబూ రంగిని" అంది వణుకుతూ. 'రంగి అంటే' అన్నాను విసుగ్గా. "అంటే... అంటే పాలదాన్ని బాబూ" అంది ఏడుపుతో. ఆమె ఎదురుగా ఓ త్రాచుపాము పడగవిప్పి తోకమీద నిల్చోనుంది. "ఏమిటి" అన్నాను అప్రయత్నంగా. 'దొరా! రక్షించు దొరా! నీ కాడికి వచ్చానుదొరా! చెడ్డదాన్ని దొరా" అంటోంది రంగి దుఃఖంతో. "అయితే" అన్నాను నేను కఠినంగా. "దొరా తెలియకుండ దారిలో తొక్కేసాను దొరా యీ పాముని. తరుముకొస్తాంది దొరా యీ తాచుపాము. నన్ను చమించు దొరా" అంటోంది రంగి నెత్తీ నోరూ మొత్తుకొంటూ.

"నాగన్నా విన్నావా పాపం పశ్చాత్తాప పడుతోంది వెళ్లు నాయనా వెళ్లు" అన్నాను నేను ఆప్యాయంగా. 'అపాయం' బోర్డు గాలికి అటూ యిటూ ఊగింది.

పాము పడగ ముడిచి సరసరా పాకుతూ వెళ్లిపోయింది. రంగి పక్కకు తప్పుకొంది దండాలు పెట్టుతూ. ఆ తరువాత రంగి నన్ను ప్రాణదాతగా గుర్తించి ఎంతో గౌరవంగా పలుకరిస్తోంది. ఎన్నో ధర్మ సందేహాలు అడుగుతూ ఉంటుంది. దానికి నేను సమాధానాలు చెబుతూ ఉన్నాను కూడ."

"ఆఁ రంగి అంత మారిపోయిందా?" అన్నాడు మరిడయ్య అప్రయత్నంగా. "గొప్పోళ్లు బాబూ మీరు. మాలాంటి ఎదవలతో మాట్లాట్టమే మీకు ఎందుకు బాబూ" అంటూ కంట తడి పెట్టారు మరిడయ్యా ఆతని అనుచరులు.

ఇంతలో యింజన్ కడుపు నీళ్లతో నిండింది. మరిడయ్యా చేతులు కట్టుకొని "పాములుంటయ్యా బాబూ యిక్కడ" అన్నాడు వినయంగా.

"ఆహా లేకేం. కావలసినన్ని ఉన్నాయి. చలికాలంలో వెచ్చగా ఉంటుందని ఈ వాటర్ మిషన్‌కింద దూరి మెలికలు చుట్టుకొని పడుకొనుంటుంది. రాత్రిళ్లు పాము బుసలు వినబడుతూనే ఉంటుంది గా. పరీ ఉక్క బట్టితే అదీ సూర్యోదయమైన తర్వాత ఒక్కోసారి బయటికొచ్చి ఎండలో ఎండిన కర్రలా పడుంటాయి. ఎండా కాలమైతే వాటర్ మిషన్ వెనగ్గా గుంటలా నిల్చిన నీటి దగ్గర వెల్లకిలా పడుకొనుంటాయి. వాటి కుబుసాలు గాలికి నీళ్లమీదపడి తేలుతూ పాములు నీళ్లలో ఈదుతున్నాయా అన్పిస్తూంటుంది" అన్నాడు శివయ్య.

'పాములు మిమ్మల్నేం చేయవా దొరా' అన్నాడొకడు ఆదుర్దాగా.

'శివుని ఆజ్ఞలేందే చీమైనా కుట్టదుగా' అన్నాడు శివయ్య నవ్వుతూ.

"వస్తాందొరా" అంటూ అందరూ రైలెక్కారు. ఇంజన్ గస పోసుకుంటూ కొండ చిలవలా, వాసుకి సర్పంలా భూదేవికి నమస్కారాలు పెట్టుతూ వెళ్లసాగింది. 'నాకూ ఏదైనా చెప్తాండు శివయ్య దొరా'అని ఎలుగెత్తి అరిచాడు మరిడయ్య చేతులెత్తి. "అలాగే" అంటూ చేతులూపాడు శివయ్య.

అంతసేపు కోలాహలంగా ఉన్న పదేశంలో క్రమక్రమంగా నిశ్శబ్దం ఆవరించింది. తిరిగి కీచురాళ్ల రొదలు 'హొంయి'మని చెవులో దూసుకొచ్చాయి. శివయ్య ఎవరో తన ఆత్మబంధువు అమాంతం మాయమైనట్లులాగే నిలబడి చూడసాగాడు. చలిగాలి తగలడం మూలాన్నో మరి దేనికో కనుకొసల్లో రెండు కన్నీటి బొట్లు నిలిచాయి.

అప్పుడే చీకటి చెట్ల సందుల నుండి వెలుతురు కిరణాలు పొడచుకొస్తున్నాయి. ప్రాణశక్తితో తకతక లాడే లేత ఆకులపై అరుణ కిరణాలు పడి తళతళా మెరిసి కందు జిగేలు మన్పిస్తోంది:

మెల్లగా వెనక తిరిగి చూసాడు శివయ్య. సన్నని తీగలల్లబడినగదిగా తయారు చేయబడ్డ స్థలమది. లోపల వాటర్ మిషన్ గుండెకాయలా 'లబ్ డబ్' మంటూంది ఆ తీగలకు తగిలించబడ్డ 'అపాయం'తెల్ల బోరు లో ఎర్రటి అక్షరాలతో అది గాలి కటూ యిటూ ఊగుతోంది. ఆ తీగల నీడలు లోపల గదిలోపడి చిత్రమైన అనుభూతిని కల్గిస్తున్నాయి. అంతలో ఆ గదిలో బుసబుస ధ్వనులు విన్పించాయి. ఉల్లిపొరల్లా గాలికటూ యిటూ కదులుతున్న పాము కుబుసాలు రెండు మూడు కన్పించాయి.

శివయ్య దృష్టి మళ్లీ వలలా అల్లబడ్డ తీగలమీదికి ప్రసరించింది. ఈవల తాను నిల్చున్నాడు. ఆవల గది లోపల తీగల నీడ. ఇది తన హృదయాన్ని ఆవిష్కరిస్తోందా? అన్పించింది. ఆకాశంలోని సూర్యరశ్మి దీని మీద పడడం వల్లనే గదా తన కిదంతా తెలుస్తోంది అనుకొన్నాడు ఈ సన్నని తీగలవల పొరలు పొరలుగా కృష్ణానదీ తరంగాలా? గోదావరీ తరంగాలా? లేక తన మనసు లోని పొరలా? పాము వదిలిన కుబుసాలా? ఈ గదిలోపలి నీడలు తన మనసులో నిల్చిన గత స్మృతుల వాసనలా? గతానుభవాల స్పర్శానుభూతులా? అవి ఎప్పుడూ ఒకేలాగే ప్రతి బింబిస్తుంటాయేమో! అవును అవి గతస్మృతుల తాలూకు నీడలు. ఈ లోపలి యంత్రం నా హృదయమా? నా మనోసార భూతమైన హృదయమా? ఆ శబ్దం ఆ స్పందనం తన లోని ప్రాణ శక్తియేమో! అది నిలిస్తే తాను లేడా? అది చెడిపోతే తాను పిచ్చివాడౌతాడా? తనకుద్యోగం లేదా? ఏమో! ఎవరికి తెలుసు. గాలికి టపటపమంటూ తీగలకు తగిలించబడ్డ యీ 'అపాయం' తన సంగతేమని అడుగుతోంది మనస్సు పొరలకు అతుక్కోవడమే దాని కర్తవ్యమా? ఇది

## నీళ్లనుంచి ఇంధనం

నీటిని ఇంధనంగా మార్చబోతున్నారు ఎం. ఐ. టి. (మేసచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ — అమెరికా) శాస్త్రజ్ఞులు. నీటిలో భాగమైన ఉదజని ఒక అద్భుత ఇంధనం. ఎం. ఐ. టి. పరిశోధకులు నీటిలోని ఉదజని, అమ్లజనివాయువులను విభజించటానికి అల్ట్రావైలెట్ కాంతిని ఉపయోగించు కొంటున్నారు. అయితే ఈ ప్రక్రియ అంత బాగా పనిచేయటం లేదు. ఈకాంతిలో ఒక్క శాతాన్ని మాత్రమే ఇంధనంగా పరివర్తన చేయటానికి వీలుకలిగింది. కనుక, ఇందు కోసం హైఫ్రిక్వెన్సీగల ఉదారంగు కాంతిని లేసర్‌ద్వారా జనింప చేశారు. ఒక బీకరులో నీటిలో ఉంచిన టిటానియమ్ డయాక్సయిడ్ క్రిస్టల్‌మీద ఫోకస్ చేస్తారు. ఒక ప్లాటినమ్ తీగ గుండా నాలుగోవంతులోపు వోల్టు విద్యుచ్ఛక్తిని నీటిలోనికి పంపగానే దానిలోని ఉదజని, అమ్లజని బుడగలు, బుడగలుగా బీకరునుంచి బయటికి వచ్చేస్తాయి. ఈ పద్ధతిని ఇంకా అభివృద్ధిపరచి దీనిద్వారా విద్యుచ్ఛక్తి తయారు చేయవచ్చునని శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు.

లోకమా ? దానికిది సంకేతమా ? లేక ద్వారమా ? అనుభవానికి ఓ ద్వారమా ? ఇది మనస్సు పొరలు సడలనీయకుండ ప్రిదిలి పోకుండ ఉండాలంటోందా ? పాము కుబుసా ల్లాంటి, ఉల్లిపొరల్లాంటి యీ పొరలు విడిలిపోతే సుఖం లేదంటోందా? అది అపాయ మంటోందా ?

మనస్సు పొరలు ఎన్నో మరి ? ఎన్నని లెక్క పెట్టేది ? ఒక్కో పొరలో ఎన్ని స్మృతులు - ఎన్ని సుఖాలు - ఎన్ని దుఃఖాలు — ఎన్ని అనుభవాలు, ఈ పొరలు ప్రిదల కూడదే గానీ హృదయం బయట పడకూడదేగాని బయటపడితే మాత్రం ఆ జీవుడికి క్షోభ తప్పదు కాబోలు ! వేదన తప్పదు కాబోలు ! ఆ కుబుసం వదిలిన పాముకు సుఖంలేదు కాబోలు ! ఆ పొరలెంత దట్టంగా గాలి చొరనీకుండా ఉంటే జీవుడు లోకంలో అంత హుషారుగా తిరుగుతాడు కాబోలు !

అయినా పాము కుబుసం వదలకుండా ఉండగలదా ? పాత పొర వదలడం కొత్త పొర రావడం అనేది దాని స్వభావం కదా ! దాని కదేం చేస్తుంది! అది నిమిత్తమాత్రం !

## ఏకాంతం

ఈ లోకంలో జీవి అనుభవంచేత పరిపక్వ మౌతున్నట్లు తోస్తోంది. అయితే యీ పాము తనలోని జీవుడా? ఆ పాముకు ఏ మాత్రం భయం లేదేమో ! దానికి అపాయం రాదేమో ! అదే దానికి పుట్టా ? అక్కడే మెలికలు చుట్టి పడుకొంటుండే మరి ? ఏమో ! ఏమో ! అనుకొన్నాడు శివయ్య కను కొలకుల్లో నిల్చిన కన్నీటి పొరలగుండ జల్లుగా కవ్విస్తున్న మిషన్ వెనక ఏర్పడ్డ చిన్న నీటిగుంటను చూడసాగాడు.

ఏకాంతంలో తనలో తానిలా ఊరికే తవ్వు కోవడం ఎందుకు ? అయినా తాను తవ్వు కొంటున్నాడా ? తానూరకే ఉన్నా తాను వద్దనుకొన్నా ఎవడో తవ్విపెడుతున్నాడు లోపల. అన్నీ చూపెడుతున్నాడు. వాడెవడో తనకంటె బలవంతుడిలా ఉన్నాడు.

శివయ్య ఇంకో రైలింజన్ రాకకోసం తపస్సు చేస్తూ కూర్చున్నాడు. అది రావడానికి యింకా కనీసం రెండు మూడు గంటలైనా పట్టవచ్చు. ఇంతలో ఏదో జ్ఞాపకాలు ఎంత వద్దనుకొన్నా కళ్లముందు గ్రీష్మంలో సాయం కాలపు ఎండలలో నీడల్లా కదలాడసాగాయి. తానీ మధ్య స్థిమితంగా ఉండలేకపోతున్నా డెందుకో ? ఒంట్లో కులాసాగానే ఉంది. నాలుగురాళ్లు వెనకేసుకోనున్నాడు. జీవితం సాఫీగా సాగిపోతోంది. కాని... ఏదో పెద్ద గ్రంథం రచించి దానిపేరు మరచిపోయిన వాడులా ఏదో క్షోభను, వేదనను లోలోపల అనుభవిస్తున్నాడు. అది దుఃఖమా అంటే కాదు. ఒంటరితనం వల్ల భయమా అంటే అదీకాదు. కాదని తనకు ఖచ్చితంగా తెలుసు. అయితే యీ దీనత్వానికి, వైరాగ్యానికి అర్థ మేమి ? ప్రశ్నించుకొన్నాడు.

శివయ్యకు ఇంతలో ఏదో అస్పష్టమైన వాసనలు వాసనలుగా కాస్త రుచులుగా తగిలాయి. అరే ! ఈ వాసన ఎక్కడిది ? గుండెను తొలుచుకొంటూ గొంతులో దూరి చప్పరించనట్లుగా నాలుకకు తగిలి మెదడులో మెరుస్తోంది. ఎక్కడిదీ వాసన ? ఎప్పుడో రుచి చూచిన వంటకంలా ఉంది. అందులో ఏదో వెచ్చదనం కూడా మిళితమైనట్లు తోస్తోంది. మాగిన దోసకాయ వాసనలిలా

వుండవె అనుకొన్నాడు శివయ్య. అదేదో గతం తాలూకు అనుభవాన్ని జ్ఞాపకానికి తెస్తున్నట్లనిపించింది. అవునవును! సరిగ్గా పదేండ్ల క్రితం తానీ వాసనను తొలిసారి పీల్చాడు. అది మళ్లీ యిప్పుడలాగే ఎలా గుర్తొచ్చింది చెప్మా! అవును, అసలీ అనుభవాలు అంతటితో కరిగిపోకుండా స్మృతి రూపంలో ఎలా నిల్చి వుంటాయో! అంటే ఏ జీవికిష్టమైన అనుభవాలు వాడు బయటికెంత విముఖుడైనా అంత రాంతరాలలో యిష్టం గనక స్మృతిగా దాగివుంటాయి కాబోలు! అనుకున్నాడు శివయ్య అనాలోచితంగా.

ఆ అనుభవం వద్దనుకొన్నా శివయ్యే లోపలివాడు చూపించ సాగాడు. శివయ్య కళ్లు తెరుచుకొనే ఉన్నాడు. మూగ టాకీ ఆరంభమైంది. మాటలు పాటలు ఎవడో లోపలివాడే చెబుతున్నాడు. శివయ్య ప్రేక్షకుడు. అదీ టికెట్టులేని ప్రేక్షకుడు. చూస్తున్నాడు శివయ్య. కదులుతోంది బొమ్మలు. శివయ్య కూడా అందులో ఓ బొమ్మ. కాని పిల్లవాడుగా కనబడుతున్నాడు. పుస్తకాల సంచి భుజానికి వేళ్లాడుతోంది ఓ పెద్ద భవనంపైన ఏదో రాసివుంది బహుశా అది ఏదో హైస్కూలయి ఉండవచ్చు.

ఓ తరగతిలో ఉన్నాడు శివయ్య. ఎవరో మాస్టారు కాబోలు వచ్చి కొన్ని పేర్లు చదివాడు. అందులో శివయ్య పేరు కూడా ఉంది. అతడు కొయ్యబొమ్మలా లేచి మాసారి ననుసరించాడు. అక్కడ ఓ గదిలో కొందరాడవాళ్లు అధునాతనంగా అలంకరించుకొన్న వాళ్లు గలగలా మాట్లాడేస్తున్నారు. వాళ్లొక్కొక్క పిల్లవాణ్ణి లోపలికి రమ్మని చేతులు, కాళ్లు, తల, నడుము కొలతలు తీసుకొంటున్నారు — ఒకావిడ పుస్తకంలో అవి వ్రాసుకొంటోంది.

అంతలో శివయ్య వంతు వచ్చింది. అతడే ఆఖరివాడులా వుంది. వాళ్లు తొందరపెట్ట సాగారు. "కమాన్ బోయ్" అందొకావిడ. శివయ్య బెరుగ్గా లోపలికెళ్లాడు. ఇంతలో ఒకావిడ తలచుట్టూ కొలత తీస్తూంటే మరొకావిడ వీపు కొలత తీస్తోంది. ముందొకరు వెనకొకరు. మధ్య శివయ్య. వాళ్లిద్దరూ పొడగరులు. పెద్దవాళ్లు. శివయ్య పిల్లవాడు. వాళ్ల స్తనాల మధ్య తన తల. వాళ్లు కొలత



మీలో ఎవరు పెళ్లికొడుకో, ఎవరు పెళ్లికూతురో తెలీడంలేదు సాములూ!

కనపడ్డంలేదని యింకొంత దగ్గరగా అదిమేస్తూ కొలత తీస్తున్నారు. శివయ్యకు శ్వాస ఆడడంలేదు. వాళ్ల శరీరాల నుండి ఏదో సెంటు వాసనలతో బాటు మరేదో కొత్త వాసన తన ముక్కు యితః పూర్వం చవిచూడని వాసన తగలసాగింది. వాళ్లిద్దరకూ పెళ్లికాలేదేమో అనుకొన్నాడు శివయ్య. వాళ్లిద్దరూ తన అవస్థ గుర్తించి తన్నింకా యిబ్బంది పెట్టసాగారు. శివయ్య తల రుబ్బుగుండులా లిప్పి బయట పెట్టాడు. ఒకావిడ చేయిపట్టిలాగి సరిగా నిలబెట్టింది. వాళ్లిద్దరేవో కూనిరాగాలు తీస్తున్నారు. అవేవో హిందీ పాటల్లా తోచింది శివయ్యకు. వాళ్లిద్దరిమధ్య శివయ్య అడకత్తెరలో పోక చెక్కే అయ్యాడు. వాళ్ల కొలత పని అయిపోయింది. శివయ్య వెళ్లిపోబోతున్నాడు ఆదుర్దాగా.

వాళ్లిద్దరూ కిలకిలా నవ్వుతూ చెరో రెక్కా పట్టిలాగి ఆ బుగ్గా ఈబుగ్గా ముద్దులవర్షం కురిపించి చేతిలో గుప్పెడు చాకలెట్లు పెట్టి 'గుడ్‌బాయ్' అంటూ వీపుతట్టి పంపించారు. శివయ్యకు నవ్వాలో ఏడవాలో తెలియలేదు.

స్కూలు ఆవరణలో కొచ్చి చూసాడు. ఒక పిట్ట కన్పించలేదు. తిరిగి ఆ గదిలో వెళ్లాలంటే భయం వేసింది. కాని మెల్లగా పిల్లిలా వెళ్లిచూసాడు. వాళ్లెలా మాయమయ్యారో శివయ్యకు అంతుబట్టలేదు. బిక్కుబిక్కుమంటూ నిల్చుండి పోయాడు. వాళ్ల శరీరాల వాసనలు మళ్లీ మళ్లీ తగలసాగింది. బుగ్గలు తిమ్మిరెక్కిపోయాయి. లేత గడ్డిపూవుతో అలవోకగా స్పృశించినట్లుంది. సన్నని సంగీతం ఏదో వెచ్చదనం తలచుట్టూ మఫ్లర్ చుట్టుకొన్నట్లు చుట్టూ తిరగసాగాయి.

మెల్లగా ఎట్లో యిల్లు చేరాడు. ఆ రోజంతా అదో లోకంలో శివయ్య ఊహలు విహరించసాగాయి. ఆ రోజురాత్రి సరిగా నిదరబట్టలేదు. కలతనిద్దుర ఎవరో స్త్రీలు నగ్నంగా తిరుగుతున్నట్లు కలలు. మళ్లా అలాంటి కలలు గడచిన పదేండ్లలో తనకెప్పుడూ రాలేదు. ఆ సంఘటనైతే తాను మరిచిపోయాడుగాని ఆ వాసనలు, స్పర్శలు తన్నుపట్టి పీడించసాగాయి. వాళ్లు తన్ను గట్టిగా కౌగిలించుకొన్నట్లు ఎప్పుడైనా ఒక్కోసారి కలలు వచ్చేవి. తానెప్పుడో చదువుకొన్నాడు ఇంగ్లీషులో - 'సోమరిపోతు వాడి బుర్ర దయ్యాలకు నివాసం' అని అయినా తానిప్పుడేమీ ఊరకే ఉండడంలేదుగా ఏదో ఉద్యోగం చేస్తూనే ఉన్నాడు మళ్లీ ఒకటి తోచింది శివయ్యకు. ఏ మనిషి నిరాలోచనగా ఏ క్షణమూ ఉండలేడు. ఏకాంత మనేది హృదయ నిష్కపట సమాధ్యవస్థ చేత సాధింపదగిందేగాని బాహిర పరిస్థితుల చేతగాదని తెలుసుకున్నాడు. మరొకటి స్ఫురించింది శివయ్యకు. స్మృతులే స్వప్నరూపంలో వస్తాయని. మనోనిగ్రహంచేత దానిని తుడిచిపెట్టవచ్చునని అది తనకు సాధ్యమా?

ఆ రోజు అనగా మరునాడు స్కూల్లో ఎవర్నో అడిగాడు.

"ఎవరువాళ్లు ?"

"ఎవరు నీవు చెప్పేది?"

'అదే నిన్న వచ్చారే!'

'వాళ్లా! కాలేజీ గర్ల్స్'

'యిక్కడికొచ్చి ఎందుకలా చేశారు?'

'ఏం చేశారు ?'

"అహ అది కాదు ఆ కొలతలు అవీ"

"వాళ్లకది పరీక్షట"

"ఎవరికి ? వాళ్లకా? తనకా?" అనుకొన్నాడు శివయ్య. ఆ తర్వాత అతడేమీ అడగలేదు.

శివయ్య ఆలోచనల్లో పడిపోయాడు. తనకిప్పుడు ఇరవై ఐదేండ్లు దాటాయి. తానిప్పుడెంత కాముకుడో అంత విరాగి. కడచిన ఐదేండ్లుగా తనలో ఏదో వైరాగ్య భావన క్రమక్రమంగా వేళ్ళు తన్నుకొంటోంది. ఒకప్పుడు తనకు స్త్రీ అంటే భయం. ఇప్పుడు భయం బదులు దుఃఖం చోటు చేసుకొన్నది. అదెలాంటి దుఃఖమో అంతు చిక్కడంలేదు. శివయ్య కొకటి స్ఫురించింది. భయంలోనే దుఃఖం - దుఃఖంలోనే సుఖం —

## ఏకాంతం

సుఖం అట్టడుగున దుఃఖం – మళ్ళీ అది పైకి త్రవ్వకోవాలంటే భయం అబ్బో! ఎంత వద్దన్నా వీటి చుట్టే తిరుగుతున్నాడే తాను. అసలు స్త్రీ అంటేఎవరు? పురుషుడంటే ఎవరు? అనేదో చిక్కుగా, విడదీయరాని సమస్యగా తోచింది శివయ్యకు.

అప్పుడు శివయ్యకు లీలగా ఒకటి తట్టింది. ఎప్పుడో చిన్నప్పుడు శివయ్య వాళ్ళ నాయనమ్మతో శివాలయంలో హరికథ కెళ్ళాడు. అక్కడ హరిదాసుగారు ఎవరి గురించో దీర్ఘంగా చెబుతున్నారు. ఆయనెవరో ప్రజాపతి అంట. మనుషులెవరూ పుట్టకముందు ఆయనొక్కడే ఉన్నాడంట ముందు. ఆయనకు చెప్పరానంత భయం వేసిందట. 'ఆయన దేవుడు కదా! ఆయనకేంది భయమేయటం?' అని అనుకొన్నాడు గాని అడగలేకపోయాడు. నాయనమ్మను అడగొచ్చు అడిగితే ఆమె విసుక్కొంటుందేమోనని ఊరుకొన్నాడు.

మళ్ళా హరిదాసు యిలా చెప్పకుపోతున్నాడు. "అలాగా ప్రజాపతికి భయం వేసింది. ఒంటరిగా ఉండలేక పోయాడు. ఆ భయం నుండే పుట్టుకొచ్చింది స్త్రీ. ఆమే మాయ. ఆమెను పెళ్ళాడాడు ప్రజాపతి. ఆమెతో ఒక్క మానవ రూపంతో తృప్తి చెందక అనేక జంతు రూపాలతో కలిసాడు. అట్లా పుట్టుకొచ్చినవే యీ సర్వ జంతు జాలాలు, మానవ రూపంతో మానవులైన మనం—" అంటూ యింకా ఏదో చెబుతున్నాడు. శివయ్య అప్పటికే మెల్లగా నిద్రలోకి జారుకొన్నాడు.

'అంటే మనిషి ఒంటరిగా ఉండలేడన్న మాట. అందుకే ఒంటరితనం చెడ్డదంటారు కాబోలు' ననుకొన్నాడు శివయ్య. ఏకాంత కోసమో తనకీ ఏకాంతం? అనుకొంటూ కళ్ళు నిర్వేదంగా మూసుకొన్నాడు.

ఇంతలో పెద్ద చప్పుడు వినిపించింది. ఎదురుగా ఏనుగు తొండమెత్తి ఘీంకరిస్తున్నట్లు సల్లని రైలింజన్ లోపల వెంకటేశం నిల్చొని "ఏమయ్యో శివయ్యా దొంగ నిద్దరోతున్నావా?" పోతులోరి లాగా యోగ నిద్దరోతున్నావా? అంటున్నాడు. శివయ్య అదరా బదరా లేచి కళ్ళు నులుముకొని లేచి నిలబడ్డాడు. పూనకం వచ్చిన వాడులా ఊగుతున్నాడు. అలాగే నీళ్ళు వదిలాడు యింజనికి.

వెంకటేశం శివయ్య చెవుల్లో నోరు పెట్టి ఓ గావుకేక పెట్టాడు. శివయ్య ఒళ్ళు జలదరించింది. రోమాలు నిక్కబొడుచుకొన్నాయి. లోకంలోకి వచ్చాడు. "ఓ వెంకటేశం! నీవా! ఏం చేస్తున్నాను నేను. నీళ్ళు వదిలానా? ఎందుకిలా నీరసించి పోయాను? నీవొచ్చి ఎంతసేపయింది? ఏమిటలా చూస్తున్నావు? నేనేమైనా పిచ్చిగా వాగానా?" అన్నాడు శివయ్య ఆదుర్దాగా.

"ఏంటయ్యో! యిలా డీలా పడిపోయావ్! ఏంటీ సంగతీ" అన్నాడు వెంకటేశం అనుమానంగా.

'ఆ ఏంలేదు వెంకటేశం రాత్రంతా నిద్దర పట్టలేదు' అన్నాడు సంజాయిషీగా.

"ఓయ్ శివయ్యా నీకోటి తెచ్చాను ఏంటో చెప్పకో చూద్దాం! చెప్ప లేక పోయావో నేనడిగే ఓ కొచ్చిన్‌కి జవాబు సెప్తే యిస్తాను" అన్నాడు వెంకటేశం.

"ఎవరిచ్చారు? అది ముందుచెప్పు" అన్నాడు శివయ్య.

"ఆఁ సరేలే చెప్పేస్తా టేసన మాస్టరిచ్చిండు" అన్నాడు వెంకటేశం.

శివయ్య బుర్ర గోక్కొన్నాడు. తెలియలేదు.

"ఉహూ ఓడిపోయావ్ యిప్పుడు నా కొచ్చిన్ కి జవాబు చెప్పు" అన్నాడు వెంకటేశం.

"ఏమిటో అడుగు."

"శివయ్యా! యీడ ఓ అర్థరాత్రికాడ నీకు బయమెయ్యదో! దయ్యాలు తిరుగతా ఉంటాయంటనే" అన్నాడు వెంకటేశం.

"దయ్యం లేదు గియ్యం లేదు. మైదానాల్లో గాలి హోరుమని వీస్తుంది. చెట్ల కొమ్మలగుండా వెదురు గొట్టాలగుండా ఈలలువేస్తూ వీస్తూంది. కిటికీ తలుపులు కొట్టుకొంటుంది. తలుపు గొళ్ళె ఊగుతుంది. వాటర్ మిషను మనిషి అడుగుల చప్పుడులా లబ్‌దబ్ మంటుంది. 'అపాయం' బోర్డు గాలికి అటూ యిటూ ఊగి చప్పుడు చేస్తుంది. నీళ్ల పంపులో నుండి ఒక్కొక్క నీటి చుక్క టప్ టప్‌మని చిన్న నీటి గుంటలో పడి చెదిరే శబ్దం వినబడుతూంటుంది. ఇదంతా గాలి చేష్టలా? వట్టి పిరికి గుండె వాడికైతే అలాంటప్పుడు భయంవేసి ఎవరో పిలుస్తున్నట్లు అదేదో దయ్యం చేష్టలేనని

యీ హడావుడి అంతా దాని తాలూకు చేష్టలే నని అనుకొంటాడు. అసలు దీని కంతా మూలకారణం ఒంటరి తనమే. గాలీ అంతేకదా! మనిషిలాగా! అది ఒకచోట నిశ్చలంగా నిలవక పరిగెత్తుతూ మరో వస్తువును పలకరిస్తూ కదిలిస్తూ దానిచే శబ్దం చేయిస్తూ ఉంటుంది. అలా చేయకుంటే దానికీ భయమేమో! ఊరికే ఉండడం అనేది సృష్టి స్వభావం కాదు. ప్రళయంలో నిశ్చలంగా నిశ్శబ్దంగా ఉంటాయి సర్వమూ! మనిషి ఓ క్షణం ఒంటరిగా ఉండలేడు. అదే నిత్యమూ వినే శబ్దాలే. యిలాంటి ఏకాంత ప్రదేశాల్లో ఒంటరిగా వింటే అదీ అర్థరాత్రి వింటూంటే దయ్యాలున్నాయనే యనుకొంటాడు. అంతేగాని దయ్యం లేదు గియ్యంలేదు” అన్నాడు శివయ్య గంభీరంగా.

“అబ్బ! అచ్చంగా బెమ్మంగారి తత్వాలు సదువుతున్నట్లే యుందయ్యా శివయ్యా! అయితే దయ్యాలని దడుసుకొనే పని లేదంటావ్! అదే సెప్పాదులే మరిడయ్య నీవు నిప్పులాంటోడివని. యిక నేనెళ్లాలి యిదిగో జాబు తీసుకో” అంటూ యింజనెక్కాడు వెంకటేశం.

శివయ్య జాబు చేతిలో నుంచుకొనే దూరంగా బుస బుసమంటూ పాకుతూ వెళ్లిపోయే రైలింజన్ చూస్తూ నిల్చుండిపోయాడు. గుండెలో ఏదో వేడి నిట్టూర్పులు నేలపైన యింజన్ వదిలిన వేడి నీళ్ల ఆవిరిలా పైకి లేస్తోంది. పంపు నుండి పడే ఒక్కొక్క నీటి చుక్కల్లా కన్నీటిబొట్లు టపటప మని జాబు మీద పడసాగింది. ఆ సన్నని సవ్వడికి శివయ్యకు స్పృహ వచ్చింది తాను ఏడుస్తున్నాడని.

కళ్ళు తుడుచుకొని జాబు చించి చదవసాగాడు.

“శివయ్యా! క్షేమం. క్షేమమని తలుస్తాను. ఇదివరకెన్నోసార్లు నీ మేనమామ కొండయ్య రావడం! నన్ను ప్రాధేయపడడం —నేను నీకు జాబు వ్రాయడం నీవు ససేమిరా ననడం జరిగిందే. మళ్ళా వచ్చాడు నీ మేనమామ. మనిషి చాలా కుంగిపోయి ఉన్నాడు. మళ్ళా పాతకథే. పార్వతి నిన్ను తప్ప మరొకర్ని ఒప్పడం లేదట. మరి నీ యిష్టం. నీవు ముఖం తిప్పేస్తావనీ తెలిసే మళ్లీ రాస్తున్నాను. నీవు గనక ఒప్పుకొంటే వెంటనే బదిలీ కూడా చేయమని అడిగాడు. చూస్తానన్నాను. దేనికీ నీ వొప్పుకొంటే గదా! నీ అభిప్రాయం తెలుపు. ఆ తర్వాత పై మాటలు.”

ఇట్లు—నీ శ్రేయోభిలాషి
ఉ మా ప తి.

గుండె దడ దడ కొట్టుకోసాగింది వాటర్ మిషన్ లాగా. ‘అపాయం’ బోర్డు ఎండ పొడలకు తళ తళ మెరుస్తూ తెల్లబోయింది. తొండం పైకెత్తిన ఏనుగులా నల్లని నీళ్ల పంపు పెంపుడు జంతువులా కన్నీళ్ళు కారుస్తున్నట్టనిపించింది. రైలు పట్టాలు దుఃఖంతో వంపులు తిరిగినట్లపించింది. అంతసేపు చుట్టూ తిరుగుతున్న కుక్కపిల్ల దాని అమ్మకోసం ‘కుయ్ కుయ్’ మని ఏడ్వసాగింది.

దుఃఖం సంతోషం రెండూ పెనవేసుకొన్నట్లయింది. అప్పుడే మసక బారుతున్న చీకట్లో వాటర్ మిషన్ దగ్గరగా రెండు పాములు రాచుకొంటూ వెళ్లాయి. శివయ్య కాగితం కలం తీసుకొని యిలా వ్రాయసాగాడు.

“ఉమాపతి గారికి నమస్కారాలు. మీ దయవల్ల నాకీ ఉద్యోగం వచ్చింది. ఉద్యోగం వచ్చిందని ఎలా తెలిసిందో నా మేనమామ పాపం వెతుక్కుంటూ వచ్చాడు. నాతో ముఖాముఖి మాట్లాడలేక మీతో నైనా నా శ్రేయస్సు గూర్చి మాట్లాడు తున్నందుకు సంతోషం. నేను మొదట అవివాహితుడు గానే ఉండిపోవాలని సంకల్పించాను. కాని పెళ్లి లేందే జీవితానికో పరిపూర్ణత లేదని తెలుసుకొన్నాను. జారిపోయిందన్న తాబేలు మళ్లీ చిక్కిందని పార్వతికి చెప్పమనండి.

భయాన్ని భయంగా అట్టి పెట్టి ధ్యానాన్ని ధ్యానంగా కొనసాగింతామంటే కుదిరేటట్లు లేదు. అది ఉంటే యిది సాగదు కాబోలు. ఎవరో మహాయోగులు అనుభవ రహితంగా కామాన్ని భయాన్ని అజ్ఞానాన్ని తుడిచిపెట్టి తత్వాన్ని దర్శిస్తారులాగుంది. అది నాచేత కావడంలేదు. భయాన్ని అనుభవంచేత మొదలంట కోసివేసి ధ్యానానికి దిగుతాను. అంతవరకు దానిలోని లోతులేమిటో నాకు బోధపడదు. సమాధి కుదరదులాగుంది. నిశ్చలత్వం లేకుండా పోతోంది. నిర్భయం చేత యోగులు మృత్యువును జయిస్తారు కాబోలు! ఆదిశంకరులంతటివారే జన్మతః కామాన్ని జయించినా వాదంకోసం అనుభవించిన తర్వాత మండన మిశ్రుని భార్యను గెల్చారని వింటున్నాం. కాబట్టి వివాహాని కొప్పుకొంటున్నాను.

ఏకాంతంలో కూర్చొని ఏదో వేదాంతం వల్లెవేస్తున్నా డనుకోండి. దేనికోసమైతే వివాహాన్ని ఓ సాధనంగా గ్రహిస్తున్నానో అందులోకూడ నేనెన్నో యేళ్ళు నిలదొక్కుకోలేనేమో అనిపిస్తోంది. ఇక్కడికొచ్చిన తర్వాత నాలో ఓ విచిత్రమైన మార్పును నే గమనిస్తూనే ఉన్నాను. భగవద్గీతలో అంగాలను ఉపసంహరించుకొన్న తాబేలులా యింద్రియాలు ఉపసంహరించుకోవాలని ఉంది. అదే నా ధ్యేయం.

మీరు నన్ను క్షమించాలి. నాకు ఏకాంతంగా ఉండటం చిన్నప్పటినుండి అలవాటు పది మంది మధ్యలో కూర్చున్నా నేను ఒంటరి వాడినే. పట్టణ వాతావరణం, ఆ ఎలక్ట్రిక్ ట్రైన్ జీవితం నా ప్రకృతికి చుక్కెదురు. పెళ్లికి ఒప్పుకొన్నా బదిలీకి మాత్రం సుతరామూ ఒప్పుకోనని నా మనసు మారాం చేస్తోంది. ఇక్కడి వాతావరణం, యీ పరిసరాల్లో వ్యక్తులు, యీ అనుభవాలు నన్ను లోలోతుల్లోకి తీసుకు పోయాయి. ఒక యోగిలాంటి వాణ్ణి అయ్యాను కాని అచ్చంగా యోగినిమాత్రం కాను కర్మయోగి కావాలనుకొంటున్నాను. పెళ్లి చేసుకొన్నా యిక్కడే కాపురం పెడతాను. దీనికి నా

## *భూలోకం స్వర్గం కాదా!*

మనసుంటే
మనుషులంతా ఒకటే!
మమతుంటే
మతములన్నీ ఒకటే!
కరుణుంటే
కులములన్నీ ఒకటే!
మనమంతా ఒకటే అనుకుంటే
అంతరాలు అంతరించి పోవా!
ఇది తెలుసుకుని మసులుకుంటే
ఈ జగం శాంతికి నిలయం కాదా!
అందరూ మనుషులే అనుకుంటే!
అసలీ జగమంతా కాగలదు, ఒకే కుటుంబం!
అబ్బ! ఎంత ఆనందంగా ఉందీ భావన
నిజంగా యీ భావనే నిజమైతే
ఈ భూలోకం, స్వర్గలోకం గాదా!
ఈ మనుషులే అనిమిషులు గారా!

—బొర్రా పాండురంగశాస్త్రి

# వారఫలం

—మహేష్—

15–8–1975 శుక్రవారం మొదలు
21–8–1975 గురువారం వరకు

**మేషం—:** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వ్యాపారంలో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధు మిత్రులను కల్సుకుంటారు.

**వృషభం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. వృత్తిలో చికాకులు ఏర్పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మిధునం:—** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమయిన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో అనవసరమైన ప్రయాస కలుగుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పోటీవారిలో వాద ప్రతివాదాలు తగవు. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా

# ఏకాంతం

మేనమామ ఒప్పుకొంటేనే పెళ్లి. మీరే మా యిద్దరిమధ్య మధ్యవర్తి. పెళ్లి పెద్దలు కూడ. తల్లీ తండ్రీ సర్వస్వమూ మీరే. మీరు నాపట్ల చూపిస్తున్న దయకు నేను సర్వదా కృతజ్ఞుణ్ణి"

ఇట్లు

భవదీయుడు –

శివయ్య.

వ్రాయటం పూర్తిచేసి ఒక్క నిట్టూర్పు వదిలాడు శివయ్య. అప్పుడే ఆవరిస్తున్న కారు చీకట్లను చీల్చుకొంటూ ఎగిసి ఎగిసిపడే సముద్ర కెరటాల మీదుగా ఆకాశలక్ష్మి ముఖబింబంలా భూమాత నుదుటి తిలకంలా పూర్ణ చంద్రబింబం పైకి పొడుచుకొస్తోంది. ఎదురుగా నిల్చున్నాడు శివయ్య తదేకంగా చూస్తూ.

ఇంతలో పొలంనుంచి యింటికిపోతున్నారు రైతు దంపతులు. రైతుభార్య అతని వెనకగా నడుస్తూ "ఏడ దాసున్నాడో బావా! జాడ తెలిసి పోయిరావా!" అని వయ్యారంగా పాడుతూ పోతోంది రైతు భుజం వెనక చేతులువేసి. రైతు హుషారుగా "రావోయి చందమామా మా వింతగాథ వినుమా!" అని చేయెత్తి ఆలాపిస్తున్నాడు.

"ఓహో! ఏనాటి పాటలివి? అనుకుంటూనే కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. అప్రయత్నంగా 'పార్వతీ' అనుకొన్నాడు ఓసారి. 'నన్ను ఆ ఒడ్డుకు చేర్చు' అనుకున్నాడు మనసులో. అప్పుడొకటి స్ఫురిస్తోంది శివయ్యకి. 'జీవితంలో సూత్రాలు తెలియనక్కరలేదు. లోతులుచూడ నక్కరలేదు. తత్వాలు చదవ నక్కరలేదు. ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి, ఒక పురుషుడు ఒక స్త్రీని జీవితాంతం అన్యభావాలకు తావీయకుండా అవిచ్ఛిన్నంగా బతికితే జన్మాంతరాల మీద అదేజీవుడిముక్తికి హేతువు' అన్పించింది.

ఒక్కసారి తల పైకెత్తి చూచాడు. ఓహో ఇన్నేళ్లుగా తానిక్కడ ఉంటున్నా చంద్రోదయం చూడలేదన్నమాట! ఇంత అందంగా ఇంత నిండుగా ఇంత గంభీరంగా చంద్రుడుదయించడం తన జీవితంలో తానేనాడైనా చూచాడా, అనుకొన్నాడు శివయ్య మనసులో.

ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురికావలసివస్తుంది. స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో పోటివారి పోటీ తగ్గుతుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెలుసుకుంటారు.

**ధనుస్సు :—** వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**మకరం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో శ్రమ కల్గుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం :—** ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. పుణ్యకార్యాలు చేస్తారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో చికాకులకు గురికాగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం— :** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.



సమత ఆర్ట్స్

# జేబుదొంగ

ఈస్ట్మన్ కలర్

దర్శకత్వం: V. మధుసూదనరావు

నిర్మాతలు: V.R. యాచేంద్ర, K. చటర్జీ